Photo by Hasam Vaidya



బహుమతి
పొందిన వ్యాఖ్య

బంతి కాదడి

పంపినవారు :
ఎం. జి. కాంతమ్మ - అదోని

వస్తూంది!

ఏ. వి. ఎం వారి

# భూకైలాస్

దర్శకత్వం :
కె. శంకర్








. . . విజయా పిక్చర్స్ రిలీజ్ . . .

G.H.RAO

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్ర కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


కునేగా - మరికొళుందు

ఇంకా 16 ఇతర రకముల సెంట్లు

రు. 1-50 నయాపైసాలు మనియార్డరుచేస్తే, 4 రకముల నమూనా సెంట్లు రిజిస్టర్డు పోస్టులో పంపుతాము

విదేశాలకు 12 ప్యాకెట్లు రు. 24/-లకు వి. పి. పి.గా. పంపబడును. లక్షలాది ప్రజ ఈ సెంట్లుతో తృప్తిచెంది, ఎంతో ఉత్సాహంతో వీటినే వాడుకచేస్తున్నారు.

నీపా హేరాయిల్, తదితర పరిమళద్రవ్యములు తయారుచేసే గంగా వర్క్సుతో చేర్చబడినది.

**CUNEGA**

*Manufacturing Perfumers*

**53, Lattice Bridge Road, Adayar, MADRAS-20**

మద్రాసు సేల్స్ ఆఫీసు — గంగా వర్క్సు

87, నైనియప్పనాయక్ వీధి, మదరాసు-3.

# అశోకా ఫ్లవర్ ఆఫ్ హెవెన్ టాల్కం

## పౌడరు అండ్ స్నో




గగన కుసుమమువంటి ఈ అపూర్వ సౌందర్యోపకరణములు, విజయ కెమికల్సువారి సుదీర్ఘ పరిశోధనా ఫలితముగా తమకు లభించుచున్నవి. నవీనమయిన కెమికల్సువల్ల, పరిమళ ద్రవ్యములవల్ల అత్యుత్తముగా తయారైనవి. వీటి ఉపయోగమువల్ల మీ సౌందర్యమును, ముఖ వర్చస్సును, యినుమడింపచేయును. ఉపయోగించిన అతిశీఘ్రకాలములోనే వీటి గుణములు మీరు గమనించగలరు. నేడే ఉపయోగింపుడు.

**విజయా కెమికల్స్,**
**మద్రాసు-7.**

ఏంజట్లు :—గుడ్ విల్ ఏజన్సీస్, బెజవాడ.

---

అత్యుత్తమమైన కలర్, లైన్, హాఫ్ టోన్
బ్లాకులకు, లలితసుందరమగు అచ్చుపనులకు

★

# యువ ప్రాసెస్

5-9-88 పబ్లిక్ గార్డెన్ రోడ్డు, హైదరాబాద్ సిటీ (ఆంధ్రప్రదేశ్)

★

నిపుణులైన టెక్నిషియనుల
నిర్వహణముతో త్వరలో ప్రారంభిస్తున్నాము



*All keyed up!*

ప్రతి మర్ఫీ రేడియో సెట్టు మీ గృహానికి మరింత ప్రతిష్ఠ చేకూర్చటానికి నిర్మించబడింది. ....ఏళ్లతరబడి మీకు మధురగానం వినిపించటానికి సృష్టించబడింది !

# murphy

ఈనాటి అత్యంత ప్రియమైన రేడియో !



**SOUNDS GOOD!**
**LOOKS GOOD!**

మోడెల్ 254

* 6-వాల్వ్ 4-బాండు * ఏసి అండ్ ఏసి/డిసి (2 మోడల్సు) * రు. 390 లోకల్ టాక్సులతో సహా

దక్షిణ ఇండియాలో సోల్ ఏజంట్లు | మహమద్ ఇబ్రహీం అండ్ కో., ప్రైవేట్ లి.,
7/8, మౌంట్ రోడ్డు :: మద్రాసు-2
బ్రాంచి : బెంగళూరు.

# THE CHOICE

# Pencils




## AJANTHA
BLACK LEAD

## EMBESEE
BLACK LEAD

## IMPERIAL
COPYING

## ACCOUNTANT
COLOUR

## CHECKING
COLOUR

## SPECTRUM
12, COLOURS

*Manufactured by*

**THE MADRAS PENCIL FACTORY**

3, STRINGER STREET,
MADRAS.




సావిత్రి ఇలా చెప్పుచున్నది, "నేను సౌమ్యమైన దిన్ని పరిమళమైన దిన్ని గనుక లక్స్ టాయిలెట్ సబ్బును ఎన్ను కొంటాను."

సొగసైన సావిత్రి, సుప్రసిద్ధ సినీమా తార తన సౌందర్యము కోసం రోజూ శుద్ధమైన, తెల్లని పరిమళ మగు లక్స్ టాయిలెట్ సబ్బునే వాడును: దీనిని మీరున్నూ ఎందుకు వాడ గూడదు?

లక్స్
టాయిలెట్ సబ్బు
సినీమా తారలకు సౌందర్యము
నిచ్చు సబ్బు

LTS. 553-50 TL

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి, వారి ఒక తయారు.




టిన్నులు-అనేక ఆకృతులలో అందంగా ముద్రించి
బహుమతులుగా ఇవ్వటానికి అర్హమైనవి.




# J. B. MANGHARAM & CO.,
## GWALIOR, INDIA

*makers of famous biscuits*

# జె. బి. మంఘారామ్ అండ్ కో.,
## గ్వాలియర్, ఇండియా

ప్రసిద్ధిగాంచిన బిస్కత్తు నిర్మాతలు




1893 నుంచి

జలుబులకు

ఇప్పటికి మూడు తరాలనుంచీ
అమృతాంజనం జలుబులనుండి
శీఘ్రమైన విముక్తికోసం
వాడబడుతున్నదని అంద
రికీ తెలిసిన విషయమే.

# అమృతాంజనము

అమృతాంజన్ లి.,
మద్రాసు 4.
మరియు బొంబాయి 1, కలకత్తా 7.




AL.57.2A. TEL.



# ధైర్యశాలి రాము



# డంబాల రంగా








నాకలలో నువ్వునేను సరిగ్గా ఇంగ్లీషు వారి టోపీలా వుండే ఒక విమానాన్ని చూశాం!....



....మనంలో పలికి వెళ్లాం అందులో ఆరుచేతులతో నున్న జనులు న్నారు, వాటిలో రెండింటితో వారు నడుస్తున్నారు..



క్షణంలో, విమానం ఆకాశంలోకి ఎగిరి పోయింది!



మనం అంగారక దేశంలో దిగాం, అచ్చటి జనుల చేత ఆదేశపురాజా వద్దకు తీసుకొనిపో బడ్డాం.

HVM. 313A-19 TL
















డాల్డా వనస్పతి పిల్లలకున్ను అందరికిన్ని బలంగలిగిస్తుంది. శరీరము నుమంచి ఆరోగ్యముగానుంచునట్టి ఎ డి. విటమిన్‌లు, దానిలో చేర్చబడియున్నవి. డాల్డాతో వండబడిన ఆహారము సులభంగా జీర్ణమౌతుంది.




హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్, బొంబాయి

HVM. 313B-19 TL.



# నీమ్ వాడుకను అలవాటు చేసికోండి

నిజానికి ఇది ఒక ఆరోగ్య ప్రదమైన అలవాటు!

ఉదయాన నీమ్ టూత్ పేస్టుతో పళ్లు తోముకొనటం, స్నానంవేళ మార్గోసబ్బును వాడటం నిత్య జీవితంలో రెండు అవశ్యకమైన పనులు. మహత్తర క్రిమిసంహారక గుణముగల వేప (నీమ్) ఈ రెంటిలో ప్రధాన వస్తువు అయి వున్నది. అది పళ్లనూ శరీరాన్నికూడ క్రిములనుండి కాపాడి, ఆరోగ్యాన్ని పెంపొందించటంలో అమోఘమైనవి.




## నీమ్ టూత్ పేస్ట్

పళ్లను పరిశుభ్రపరుచుటలో ఆదర్శమయింది

## మార్గో సోప్

పరిమళయుతమైన నీమ్ టాయిలెట్ సబ్బు.




ది కలకత్తా కెమికల్ కంపెనీ లిమిటెడ్ వారి తయారీలు

దక్షిణ ఇండియా ఆఫీసు:

5/149, బ్రాడ్వే, మదరాసు - 1.

అక్టోబర్
25వ
తేది నుండి
విశాలాంధ్ర
అంతా విడుదల



రాజశ్రీ
ప్రొడక్షన్స్ వారి

సతీ అనసూయ






రాజశ్రీ విడుదల

# రవి టాయ్‌లెట్స్‌ను వాడండి

## రవి గ్లిసరిన్ సోపు:

మీ అందమును వర్చస్సును కాపాడును.

## రవి వెజిటబుల్ హేరాయిల్:

మీ కేశములను విరివిగా పెంపొందించును.




## రవి స్నో:

మీ ముఖవిలాసమును అభివృద్ధి చేయును.

సోల్ ఏజంట్లు:

**ది న్యూ స్టార్ & కంపెని,**

తండియార్పేట :: మద్రాసు-21

---

# అద్వితీయమైన నాణ్యము! అతి సరసమైన మూల్యము!!

FOR *Costly* PENS

**Iris**

**INKS**







# ఐరిస్ సిరాలు

ఫౌంటెన్ కలములకు పేరెన్నిక కన్నవి.

1, 2, 4, 12, 24 ఔన్సులు ప్యాకింగులలో లభించును.




తయారుచేయువారు:

## రీసెర్చి కెమికల్ లెబొరేటరీస్

మద్రాసు-4 ★ న్యూఢిల్లీ-1 ★ బెంగళూరు-3

# తల్లులకు హెచ్చరిక!

## ప్రమాదకరమైనవ్యాధికిదించకముందే మీబిడ్డజలుబుబాధనివారించుకోండి!

ఈ మంచి ఘాటైన పూత మందును ముక్కు, గొంతు, గుండెల బాధల నివారణకు రాత్రిపూట రుద్దండి!

మీ బిడ్డకు జలుబు చేసినపుడు అశ్రద్ధ చేయవద్దు. మీ బిడ్డ గుండెల మీద, వీపుకు, గొంతుకు రాత్రిపూట నిద్రపోబోయే ముందు రుద్దండి. ఎక్కడైతే జలుబు బాధలు వుండగలవో అక్కడల్లా అతడికి కొంత ఉపశమనం కలుగుతుంది. రాత్రల్లా మీ బిడ్డ హాయిగా నిద్రపోతూ వుండగానే మీ బిడ్డ జలుబు బాధలను విక్స్ వేపోరబ్ నివారిస్తూనే వుంటుంది. ఉదయానికల్లా అతడు మామూలుగా అవుతాడు.

జలుబును 2 విధాల నివారిస్తుంది!



**1** ముక్కు ద్వారా పనిచేస్తుంది.

మీ బిడ్డ గాలిని పీల్చునపుడు విక్స్ వేపోరబ్ ఘాటైన వాసన శ్వాస నాళాలలోనికి పోయి ముక్కు, గొంతుల జలుబు బాధలను నివారిస్తుంది.



**2** చర్మం ద్వారా పనిచేస్తుంది.

విక్స్ వేపోరబ్ మీ బిడ్డ చర్మానికి వెచ్చదనం చేకూర్చి, ఉపశమనం కలిగించి, తద్వారా గుండెలలోని జలుబు బాధలను నివారిస్తుంది.

గుండె, గొంతు, వీపులపై రుద్దండి!




విక్స్ వేపోరబ్

328 TE

విక్స్ వేపోరబ్ ఇప్పుడే వాడి చూడండి!

కొత్తది, చేతిలో ఇముడు నమూనా సైజు డబ్బా ధర 40 న.పై. మాత్రమే

పన్నులు అదనం



'మైసూర్ పేపర్ స్టాకిస్టులు'

## వి. వి. రావు అండ్ బ్రదర్స్,

అన్ని రకముల కాగితముల వ్యాపారులు, ఉత్పత్తిదారుల ప్రతినిధులు

H. O. 6 ఎ, వారెన్‌రోడ్, మైలాపూరు, మద్రాసు - 4

తంతి : VIOLETS ఫోన్ : 71599

చిల్లర వ్యాపార వివరములకు :

నెం. 17, బద్రియన్ వీధి, మద్రాసు - 1



దీపావళీ శుభసమయాన చందమామ పాఠకులను
హృదయపూర్వకముగ అభినందిస్తున్నారు.

కీలకం తెలుసుకుంటే పాకశాస్త్ర ప్రవీణులు కావచ్చు!

పురాణకాలంలో నల, భీములు పాకశాస్త్రంలో కీలకం తెలిసినవారు. కనుకనే, వారి చేతి వంట జీవం కల్గి మెప్పు పొందింది. ఈనాడున్ను స్త్రీలు చక్కటి వంట చేసి మెప్పు పొందవచ్చు. అయితే, వంటలో గల కీలకం తెలుసుకోవాలి. గుమగుమలాడే ఎల్. జి. ఇంగువను వాడితే, పదార్థాలు బలే రుచిగా ఉన్నవని పేరు వస్తుంది. ఇదే ఆడవారు తెలుసుకోవలసిన కీలకం!

HELP IN
HOME SCIENCE



ఎల్.జీ
எல்.ஜி




లాల్‌జీ, గోధూ & కంపెనీ - సౌకార్ పేట - మదరాసు

# రోజంతా శుభ్రముగా

# నుండుటకు

ఆకర్షణీయమైన సువాసన, బహుమెత్తని పొడి-మరే టాయ్‌లెట్ పౌడరులోనూ లేనట్టి-చమట దుర్గంధమును, చర్మవ్యాధులను గలిగించు క్రిములను నిర్మూలించే లోకప్రసిద్ధయిన జి.11* వీటిని గలిగియున్నప్పటికి గోద్రెజ్ టాయ్‌లెట్ పౌడరు ఎక్కువ ఖరీదేమీ లేదు.

స్నానానంతరముగాని, క్షౌరానంతరముగాని, గోద్రెజ్ టాయిలెట్ పౌడరును చల్లుకుంటే మీరు చాల ఉత్సాహముగాను, ఎక్కడకు వెళ్ళినా ఆదరణీయుంగాను వుంటారు.

ఉక్కపోతనుండి నిలకడైన శీఘ్ర విముక్తి గలిగించి, చమట వల్ల చర్మము రేగుటను పోగొట్టును.. ఇది పసిబిడ్డలకు వరప్రసాదము!

బట్టల మీద చల్లితే చర్మ ఉష్ణమును నిరోధించును.

**గోద్రెజ్ టాయ్‌లెట్ పౌడరు**

దుర్గంధమును పోగొట్టును • సురక్షకమైనది
సువాసనగలది • శమనకరమైనది

సంపూర్ణ రక్షణకు
సింథాల్‌తో స్నానముచేసిన
పిదప వాడండి.
(*పేటెంట్ పెన్డింగ్ హెక్సాక్లోరోఫిన్
యు. ఎస్. ఏ.)




**గోద్రెజ్** శ్రేష్ఠమైన సబ్బులను
ఇతర టాయిలెట్టులను తయారుచేయును.

# ఇది నిక్కము...



...పగిలిన పాత్ర, నీటిని మంచి
పాత్ర ఉంచినట్లు నిలవుంచదు,
శిరోజ రంగుతో నలుపుచేయబడిన
శిరోజముల నలుపు లోమాతో
చేయబడినట్లుగా నిలవుండదు.

శిరోజరంగు శిరోజరములను
నైపైని మాత్రమే నలుపుచేయును,
లోమా శిరోజములను సహజంగా నలుపుచేయును.




జగత్ప్రసిద్ధమైన చెంద్రు
కలను సహజంగా నలుపు
చేయునట్టిది.

సోల్ ఏజెన్టు. ఎమ్. ఎమ్. ఖంభట్‌వాలా అహమదాబాద్ 1

ఏజంట్లు :

## సి. నరోత్తమ్ అండ్ కో.,
బొంబాయి - 2.

★

## ఢిల్లీ మెడికల్ స్టోర్సు, ఢిల్లీ.

★

## షాహ బవిషి అండ్ కో.,
రాధాబజార్ స్ట్రీట్, కలకత్తా.

★

## జె. బలాభాయ్ అండ్ కో.,
నేతాజీ సుభాష్ రోడ్, మద్రాసు.



# Pilot



PEN

INK




పైలట్ పాళీ ప్రపంచంలోకెల్ల
ఉత్తమమైంది, పైలట్ సిరాను
ఉపయోగిస్తే అతిచక్కగా
రాస్తుంది.

MANUFACTURED BY
**The PILOT PEN CO., (INDIA) PRIVATE LTD.**
CATHOLIC CENTRE, MADRAS-1.




రిజిస్టర్డు నం: 119923

# డైమండ్ సుగంధవక్క పొడి

## ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధిచెందినదిన్ని. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

## ది డి. పి. అండ్ కంపెని,

## కౌల్‌బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - కర్నూలు - ఆదోని - హుబ్లి.

# ఆరోగ్యమునందు ప్రీతిగలవారు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

పిల్లలు మురికిగా నగుట చాల సహజము, అయితే మురికిగా నుండిపోవుట వారికి చెరుపు. ఎందుచేతననగా, మురికిలో వ్యాధికారక క్రిములున్నవి. వాటి వల్ల ఆరోగ్యమునకు ఎడతెగని ప్రమాదమున్నది.

లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోని క్రిములను కడిగివేసి
మీ ఆరోగ్యమును కాపాడును. ప్రతిరోజూ
లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయుడు.




L. 267-50 TL









FOR
Anything &
Everything in
STAINLESS
STEEL WARE

# I.M.M.C

FOR QUALITY





ఈ గుర్తుతో వున్న స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు గ్యారంటీ కలవి

చిలుము, తుప్పు పట్టవు. ఎల్లప్పుడు తెల్లగా మెరుస్తూ
వుండును. తోముటకు చాల సులువైనవి.

'దీపావళీ బహుమతులు'గా ఇవ్వతగినవి.

**ఇండియన్ మెటల్ & మెటలర్జికల్ కార్పొరేషన్,**

498, మింట్ స్ట్రీట్ :: మద్రాసు - 3





# ది ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంకు లిమిటెడ్

ఇండియాలో బ్రాంచీలు : సెంట్రల్ ఆఫీసు : **మద్రాసు - 1**

| | | | |
|---|---|---|---|
| అలెప్పె | కారైకాల్ | మంగళూరు | సేలం |
| బెంగళూరు సిటీ | కారైకుడి | మదురై | షియాలి |
| బొంబాయి-ఫోర్టు | కీలనపల్వట్టి | మయూరం | శివగంగ |
| బొంబాయి-మాండవి | కూత్తానల్లూర్ | మైసూరు | శివకాశి |
| కలకత్తా | కొజైకోడు | న్యూఢిల్లీ | తంజావూరు |
| కెననూర్ | కుంబకోణమ్ | నాగపట్టణం | తిరునల్వేలి టవున్ |
| కొచ్చి | మద్రాసు జి. టి. | పెరంబవూర్ | తిరువయార్ |
| కోయంబత్తూరు | ,, మౌంట్‌రోడ్ | పాండిచేరి | తిరుచిరాపల్లి |
| దేవకోట | ,, త్యాగరాయనగర్ | పుదుక్కోట | తూత్తుకుడి |
| గుంటూరు | ,, మైలాపూర్ | పుదుపట్టి | తిరువనంతపురం |
| హైదరాబాద్ (దక్కన్) | ,, పరశువాకమ్ | క్విలన్ | |

ఘాట్ స్టేషన్ : కుత్తాలమ్ (తంజావూరు)

ఓవర్‌సీస్ బ్రాంచీలు : బర్మా - రంగూన్. సిలోన్ - కొలంబో, మలయా - ఇపో, కులాలంపూర్, పెనాంగ్, సింగపూర్, మలాక్కా, థాయిలాండ్ - బాంగ్‌కాక్, హాంగ్‌కాంగ్

★ ముఖ్యకేంద్రాలలో విదేశీయ కరెస్పాండెంట్లు కలరు. ★

అన్నివిధములైన బ్యాంకింగు వ్యాపారములు జరుపబడును. ప్రత్యేకించి కోస్తావ్యాపారస్తులకు అవసరమైన సమస్తసదుపాయాలు సమకూర్చబడును.

ఎమ్. సిటి. ముత్తయ్యా, చేర్మన్. సి. పి. దొరైకణ్ణు, జనరల్ మేనేజరు.

టెలిఫోన్: 3132

# సి. ఎమ్. ఆర్. అండ్ కంపెనీ,

హెడ్ ఆఫీసు:

**313,** తంబుచెట్టి వీధి, మద్రాసు - 1

బ్రాంచి: 27/14, హై రోడ్డు, చిత్తూరు.

★

ఆస్బెస్టోస్ సిమెంటు షీట్లు, ఏ.సి రెయిన్ వాటర్ పైపులు ఫిట్టింగులు, ఆల్విన్ అండ్ ఫోర్డీలక్స్ ఉక్కు ఫర్నిచర్ల డీలర్లు.

చెంగల్పట్టు జిల్లాకుకూడా ఆల్విన్ అండ్ ఫార్డీలక్స్ ఉక్కు ఫర్నిచరు డీలర్సు

ఇంగ్లీషు, తమిళం, మలయాళం
భాషలలో ఉత్తమమైన డిజైన్లలో
ఎన్నికైన టైపులను,
మరియు





పర్ఫొరేటర్లు, హార్డుప్రెస్సులు,
ట్రెడిల్సు, కటింగ్‌మిషన్లు, ఇత
రములైన ముద్రణ పరికరాలను
మీకు కావలసిన రీతులలో, తగిన
వెలలకు సప్లయిచేయగలము.



# ది మద్రాసు టైప్ ఫౌండ్రి

**38,** జోన్స్ స్ట్రీట్ :: మద్రాసు - **1**




# హెచ్. ఎమ్. వి.

రేడియోలు & రేడియోగ్రాములు

మద్రాసు సిటీ డీలర్సు:

## రేడియో సర్వీసెస్

(నమ్మకమైన రేడియోలు దొరకు స్థలము)

నిర్వాహణ: కృష్ణన్ అండ్ కృష్ణన్

ప్రదర్శనశాల:
10, మౌంట్ రోడ్డు, మద్రాసు-2

బ్రాంచి అండ్ సర్వీస్ స్టేషన్:
24, జనరల్ పేటర్స్‌రోడ్డు, మద్రాసు-2

సరసమైన చార్జీలకు అనుభవనీయమైన సేవ

## సాహితీప్రియులు చదువవలసిన ఉత్తమ సాహిత్య ప్రచురణలు:

1. వింతప్రణయం (నవల)
   శ్రీ 'భాస్కరభట్ల' రచన రూ. 1
2. ఉరుములు - మెరుపులు
   శ్రీమతి శ్రీదేవి రచించిన
   కథల సంపుటి రూ. 1
3. ఆనందనిలయమ్
   గోరాశాస్త్రి రచించిన
   హాస్యనాటిక 1-25 న.పై.
4. డిటెక్టివ్ కెయాస్
   శ్రీ టి. వి. శంకరమ్ రచన 75 న.పై.
5. గులాబిముళ్ళు
   ఇచ్ఛాపురపు జగన్నాథ
   రావు రచన రూ. 1
6. కామినీ - కాంచనమ్
   'వృశ్చిక' రచించిన
   నాటిక 75 న.పై.

ఇతర వివరాలకు:

## సాగర్ పబ్లికేషన్స్, 11, బ్రాడ్వే, మదరాసు-1

# తారతమ్యము లెరిగిన ముద్రాపకుడు

తన పనికి కావలసిన పరికరాలు, అనగా
—చక్కటి కాగితం, మంచి సిరా, స్ఫుటమైన టైపు
ఎంచుకొనుటలో ఎంతో జాగ్రత్త తీసుకొనును

అతను **గేంజస్ సిరాలనే** ఉపయోగించును

ఎందుచేతనంటే

## నాణ్యమునకు, పొదుపునకు
## సుఖంగా పని సాగిపోవటానికి

ఈ సిరాలు నమ్మకమైనవని అతనికి తెలుసును

ఫ్యాక్టరీలు: హౌరా • బొంబాయి • మద్రాసు.



## హాయిగా,
## స్వేచ్ఛగా త్రొక్కడానికి
## అనువైన సైకిల్



# రా లె
# రాబిన్ హుడ్

సెన్-రాలె బైసికల్ ప్రతివక్కటీ శ్రేష్టమైన ముడిపదార్థాలను అత్యధునాతమైన సాంకేతిక పద్ధతులద్వారా ఉపయోగించి, ప్రతి విభాగాన్ని ప్రత్యేకంగా పరీక్షించి తయారుజేయబడినది. అందువల్ల వాడకానికి ఏమీ ఖర్చుపెట్టకుండానే, స్వేచ్ఛగా, ఇష్టం వచ్చినట్టు సైకిల్‌ను వాడుకొనవచ్చు.

# సెన్-రాలె



# మీా బిడ్డ...

1, 3 సంవత్సరముల మధ్య, శాఖాహారులైన మగ బిడ్డలలో, లివర్ వ్యాధులు సామాన్యమని, మా లెక్కలవల్ల తేలుచున్నది.

తరుచుగ అజీర్ణ వ్యాధులు, కడుపు ఉబ్బరము, చికాకు పడుట, కోపము, ఆకలి మందగించుట మొదలైన గుణములు లివర్ వ్యాధిని సూచించు లక్షణములు.

సకాలంలో జమ్మివారిని సలహా చేయుండి.




జమ్మిస్

# లివర్‌క్యూర్

జమ్మి వెంకటరమణయ్య & సన్స్
జమ్మి బిల్డింగ్స్, మైలాపూర్, మద్రాసు - 4.
బ్రాంచి: విజయవాడ, తాడంకివారి వీధి, గవర్నరుపేట. విజయనగరము పెద్ద... కూడుగంటివారి వీధి.



ఇదుగో! నీ

# అశోకా

అశోకా పెన్ వర్క్సు తెనాలి ఆంధ్ర

"మీరు కూడా మీ బట్టలకు టినోపాల్
ఉపయోగిస్తున్నారని తెలుస్తోంది"





తెల్లని బట్టలు ప్రకాశించేలా తెల్లబడేటట్లు, చేయాలంటే, దానికి సరియైన మార్గం "టినోపాల్", కొద్దిగా టినోపాల్, ఒక్కసారి ఉపయోగించితే మూడు నాలుగు ఉతుకులవరకూ చాలుతుంది.

# టినోపాల్



"టినోపాల్" జె. ఆర్. గాయ్‌గి యస్. ఏ. బాల్. స్విట్జర్లాండ్ వారి ట్రేడ్‌మార్కు.

సుహృద్ గెయ్‌గి ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్
పి. ఒ. బాక్సు నం. 965, బొంబాయి.

SISTA'S - AML - 32 - TEL

# జాన్సన్ అండ్ జాన్సన్

## సొగసైన పాపాయిలకు ఒక సొగసైన పౌడరు




**ఉచిత పుస్తకము:** పిల్లల సంరక్షణను గురించిన ఉచితముగా దొరకే జాన్సన్ యొక్క పుస్తకము కావాలని వ్రాయండి. దీనిలో తల్లి తండ్రులకు ఉపయోగపడే విషయములు ఎన్నో ఉన్నాయి. మీకు యింగ్లీషు మరియు హిందీ పుస్తకములలో ఏది కావాలో తెలపండి

జాన్సన్ అండ్ జాన్సన్, పి.ఓ. బాక్స్ 1976, డిపార్ట్‌మెంట్ 40ఐ- బొంబాయి

J B : 4165

*Make* LIGHT *work of it!*



USE

MAZDA

LAMPS



*Made in India for the Agents for :*

THE BRITISH THOMPSON HOUSTON CO., LTD.



**Associated Electrical Industries (India) Private Ltd.**

***Head Office :***

**'CROWN HOUSE', 6, MISSION ROW, CALCUTTA**

*Branches at*

**BOMBAY - NEW DELHI - MADRAS - BANGALORE - COIMBATORE - NAGPUR**



# K. ORR & COMPANY

40, CHINNATHAMBI STREET,

MADRAS-1

★

*Phone : 3519*

*Grams :*
*PRESUNDRY*

**Stockists :**

PAPER, PRINTING INKS,
GERMAN LITHO PLATES
PROCESS ZINC SHEETS,
BUTTERFLY GUMMED TAPE

**Indenting Agents :**

PAPER ★ METAL CHEMICALS
★ IRON & STEEL ★
PRINTERS' SUNDRIES

*Choice Services with Choice Commodities*

మీయొక్క దేహ సౌఖ్యమునకును,
అందమునకును
ఆర్‌సిల్లా - అల్పా - మ్యాకెటి ఆక్సైడ్ -
విచ్‌హేసిల్‌తో చేరిన




ఫెస్టివల్
సూపర్ శాండల్ టాల్కం పౌడర్
అండ్ స్నో
తయారుచేయువారు :-
మురళీ ట్రేడర్సు, కాస్మెటిక్స్ డిపార్టుమెంటు
మదరాసు - 21.

Ramu

# త్వరలో విడుదల!











బి.యల్.ఎ.సెట్టి కానుక

విఠల్ ప్రొడక్షన్సు వారి



# వద్దంటె పెళ్లి

నిర్మాత, దర్శకులు
శ్రీ.బి.విఠల.ఆచార్య

మాటలు, పాటలు
క్రిష్ణమూర్తి.రామ్‌చంద్

క్రిష్ణా పిక్చర్సు రిలీజ్

ART & PUBLICITY.

నైజాం & సీడెడ్ డిస్ట్రిబ్యూటర్లు: పూర్ణా పిక్చర్స్, విజయవాడ

వర
ప్రసాదితులైన
కళాకారులు



జీవితంలోని మంచి వస్తువులను, వరప్రసాదంగా కళాశక్తిని పొందినవారే మెచ్చుకోగలరు. బిస్కత్తుల తయారీలో ఈనాడు కళాత్మకంగా చేసిన ఉత్తమ సాధనకు ఫలితమే ప్రసిద్ధమైన పార్లే గ్లూకో బిస్కత్తులు. మంచి బలానికి గ్లూకో బిస్కత్తులు తినండి.




* పార్లేవారి
# గ్లూకో
బిస్కట్లు
విటమిన్‌లతో గూడి యున్నట్టివి

PG.57.5

పార్లే ప్రోడక్ట్స్ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి










పరీక్ష చేయబడి ప్రశస్తమైనదిగ
ఋజువు పొందిన

దుర్గా  బ్రాండు

పోర్టులేండ్ సిమెంటు
తయారు చేయువారు

ఆంధ్రా సిమెంటు కంపెనీ లిమిటెడ్
విజయవాడ

# ఫిలిప్స్

దీపములకు... రేడియో లకు...

మోడరన్ ఆటో స్టోర్సు...

ఆథరైజ్డు డీలర్సు ........ విజయవాడ..!...



మా అభిమాను లందరికి

దీపావళీ శుభసమయాన

అభినందనము లర్పిస్తున్నాము



మేలైన ముద్రణకు

నెల్‌సన్ టైపులనే

ఉపయోగించండి



# నెల్‌సన్ అండ్ కో

**(ది ఫైన్ ఆర్ట్ టైప్ ఫౌండ్రీ)**

స్థాపితము : 1916

చూళై :: మదరాసు - 7



"చందమామ" నెల్‌సన్ టైపులతో ముద్రింపబడుతున్నది.

# అక్టోబరులో విడుదల!



మినర్వా పిక్చర్సు వారి

# సారంగధర

తెలుగు

డైరెక్షన్... వి.యస్. రాఘవన్

కథ, మాటలు, పాటలు
సముద్రాల

సంగీతము
ఘంటసాల



Elegant

Rights Controlled by... THE ANNAMALAI CORPORATION (PRIVATE) LTD. MADRAS 4.

డిస్ట్రిబ్యూటర్సు :

ఆంధ్ర : శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్, గాంధీనగర్, విజయవాడ - 2.

సీడెడ్ : భాస్కర్ పిక్చర్స్, గుంతకల్లు.

# అందముగ మన్నే ఒక అందమైన చీర!

మీరు బిన్నీవారి అసలైన సిల్కు జార్జెట్ చీర కట్టుకుంటే ఎంతో అందముగ కనపడతారు. అది అసలైన సిల్కుతో నేయబడినది కనుక దాని మెత్తదనము మరియు సహజమైన తళతళ చాల కాలము ఉండును.

బిన్నీవారి అసలైన సిల్కు జార్జెట్ చీరలను ఎన్నో సార్లు యింటివద్ద ఉతుకుకున్నా అవి ఒంటి మీద అందముగ నిలిచేలా ఉంటాయి. వాటి మనోహరమైన రంగులు పోవు.

అందముగ చాల కాలము మన్నే బిన్నీ వారి సిల్కు జార్జెట్ చీరలను కొనండి!

బిన్నీవారి యితర సిల్కు చీరలు

మెత్తని సిల్కు చీరలు: పుష్ప దళమువంటి ఈ మెత్తని సిల్కు చీరలు బంగారు అంచు మరియు సరిక్రొత్త డిజైనులతో తళతళలాడే రంగులలో దొరకుతున్నాయి. వీనిని యింటివద్ద ఉతుకుకోవచ్చును.

క్రేప్ సిల్కు చీరెలు: ఈ కొత్త అందమైన, స్వచ్ఛమైన సిల్కు చీరె నేత్రానందకరమైనది. అందమైన బంగారు అంచులు.



అసలైన బిన్నీవారి చీరలన్నిటిమీద బంగారు రంగులో యీ ముద్ర వేయబడియున్నది

బెంగుళూరు వులెన్, కాటన్ అండ్ సిల్కు మిల్సు కంపెనీ లిమిటెడ్
మ్యానేజింగ్ ఏజెంట్లు:
బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్

BY. 3120 a (R)

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

జీవితం అనేక రకాల పీడలతో కూడుకుని ఉంటుంది. వాటిని ఎదుర్కొనేటందుకు సంఘశక్తులు పని చేస్తూంటాయి. అలాటి పీడలలో అగ్రస్థానం వహించేది అరాజకం. అరాజకం ఏర్పడకుండా చూడవలిసిన బాధ్యత పాలకులది. వారు అసమర్థులై ప్రజాజీవితాన్ని సక్రమంగా నడిపించనట్టయితే సంఘంలోని దుష్ట శక్తులు విజృంభిస్తాయి. న్యాయం నశిస్తుంది. ప్రజలు పీడించబడతారు. వారు తమ పాలకుల వినాశనాన్ని కోరుతారు. సంఘశక్తులు భ్రష్టయిపోవటంచేత అరాజకం సులువుగా నిర్మూలనం కాదు.

ఈ విషయాలు "అరాజకం" (జాతక కథ) లో చక్కగా వివరించబడ్డాయి. దుష్టులైన రాజోద్యోగులకూ, దొంగలకూ మధ్య నలిగి దేశంలోని వివిధ వృత్తులవారు, ఆఖరుకు నోరులేని జంతువులు సయితం, అరాజకం మూలంగా ఎంత బాధపడినదీ ఈ కథ నిరూపిస్తున్నది.



సంపుటి 21 నవంబర్ 1957 సంచిక 5



# దీపావళి

రాజు అసమర్థుడైనప్పుడు దేశంలో అరాజకం ఏర్పడి ప్రజలు ఎన్ని విధాల బాధపడతారో "అరాజకం" [జాతక కథ] లో వర్ణించబడింది. అరాజకం తాత్కాలికంగా ఏర్పడేది.

కాని మానవచరిత్రలో అప్పుడప్పుడూ బలవత్తరమైన లోకకంటకులు పైకి వచ్చి ప్రపంచవాసుల జీవితాన్ని దుఃఖభరితం చేసి అంతటా అంధ కారం కలిగిస్తారు. వారిని నిర్మూలించటానికి సాధారణ మానవశక్తులు చాలనప్పుడు భగవంతుడే అవతరించి ప్రపంచాన్ని దుఃఖంనుంచీ, అంధ కారంనుంచీ రక్షిస్తాడని మన పురాణాలు చెబుతున్నాయి.

అలాటి మానవ విమోచనానికి చిహ్నం దీపావళి. అందుచేత మనం ఏటా ఈ పండగను జరుపుకుంటున్నాం. లోకకంటకుడైన నరకాసురుడు తన ధాటికి ఎదురులేదని విర్రవీగుతూ మూడు లోకాలను పీడించే సమయంలో, శ్రీకృష్ణుడు సత్యభామాసమేతుడై ఆ లోకకంటకుడిపై దండెత్తి వెళ్లి, అతనిని సంహరించి, ప్రపంచానికి ఆనంద వికాసాలను తిరిగి ప్రసాదించాడు. ప్రజలు ఆ దంపతులకు జేజేలు పట్టారు.

లోకకల్యాణంకోసం పురుషుడితో సమంగా స్త్రీకూడా పోరాడాలన్న సూత్రాన్ని సత్యభామ ఆనాడే అమలుచేసింది.

ఈనాడు ప్రపంచం శాశ్వతశాంతి సౌఖ్యాలకోసం కృషి చేస్తున్నది. ఈ కృషిలో స్త్రీ పురుషులు సమంగా పాల్గొనాలి. అందుచేత ఈ దీపావళి పుణ్యసమయాన ఆ పుణ్యదంపతులను స్మరించుదాం.




బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో ఉత్తర పాంచాలదేశపు రాజధాని అయిన కాంపిల్యనగరానికి పాంచాలుడు రాజుగా ఉండేవాడు. అయన భోగలాలసుడూ, అవినీతిపరుడూ అయి, రాజ్యపరిపాలన విషయంలో కొంచెంకూడా శ్రద్ధ వహించలేదు. యథారాజా, తథా ప్రజా అన్నట్టు, రాజునుబట్టి మంత్రులుకూడా అవినీతిగా ప్రవర్తించసాగారు. ప్రజలపై నానాటికీ పన్నుల భారం హెచ్చసాగింది. అరాజకం తలఎత్తింది.

ఈ అరాజక పరిస్థితిలో ప్రజల జీవితం తారుమారయింది. పగలు రాజభటుల పీడా, రాత్రి దొంగల పీడా హెచ్చిపోయింది. అందుచేత నగరవాసులు తమ ఇళ్లకు తాళాలుపెట్టి, వాకిళ్లకు ముళ్ళకంపలు అడ్డం పెట్టి, తమ భార్యలతోనూ, బిడ్డలతోనూ అరణ్యానికి వెళ్లి అక్కడ తల దాచుకోసాగారు. వాళ్ళు పగలల్లా అడివిలో గడిపి, అర్ధరాత్రివేళ తమఇళ్ళకు వస్తూండేవారు.

ఈ సమయంలో బోధిసత్వుడు నగరం వెలపలవుండే ఒక తిందుకవృక్షానికి అధిష్ఠానదేవతగా జన్మించాడు. రాజు ఆ వృక్షానికి ఏటా పూజలు జరిపించి, ఉత్సవాలు జరిపి, దానికింద వెయ్యిమాడలు ఖర్చుచేసేవాడు. "అయ్యో, నన్ను ఇంత శ్రద్ధాభక్తులతో ఆరాధించే ఈ రాజు అవివేకంవల్ల తన దేశానికి అరాజకం తెచ్చిపెట్టుకుంటున్నాడు. ఇతనికి సరిఅయిన ఉపదేశం చెయ్యటానికి నేనుతప్ప ఇంకెవరూ లేరు!" అనుకున్నాడు తిందుకదేవుడు.

వెంటనే అయన రాజు నిద్రించే చోటికి వెళ్లి ఆయన ఎదట ప్రత్యక్షమయాడు. దేదీప్యమానంగా వెలుగుతూ తనముందు సాక్షాత్కరించిన ఆ రూపాన్ని చూసి రాజు, "దేవా, మీరెవరు?" అని అడిగాడు.





"రాజా, నేను తిందుకదేవుణ్ణి. నీకు సరిఅయిన బోధచెయ్య వచ్చాను!" అన్నాడు తిందుకదేవుడు.

"ఏమిటా బోధ?" అని రాజు భక్తి పూర్వకంగా అడిగాడు.

"రాజా, నీవు శ్రద్ధలేక పరిపాలన చేస్తున్నావు. అందుచేత నీరాజ్యం నాశనమయి పోతున్నది. అశ్రద్ధగా పరిపాలించే రాజు ఈ లోకంలో తన రాజ్యాన్ని పోగొట్టుకుని పరలోకంలో నరకం అనుభవిస్తాడు. రాజును బట్టి ఇతరులుకూడా శ్రద్ధలేనివారై పోతారు గనక, రాజు ఎన్నడూ శ్రద్ధ విడవరాదు," అని చెప్పాడు తిందుకదేవుడు.

"దేవా, నేనిప్పుడేం చెయ్యాలి?" అని అడిగాడు రాజు.

"ఇప్పటికైనా నీరాజ్యపాలన విషయాలు నీవే స్వయంగా చూసుకుని, అరాజకాన్ని తొలగించి, రాజ్యాన్ని కాపాడుకో!" అని తిందుకదేవుడు అదృశ్యుడయాడు.

రాజుకు జ్ఞానోదయమయింది. ఆయన తన రాజ్యం ఎలా ఉన్నదీ స్వయంగా చూడటానికి నిశ్చయించుకున్నాడు. మర్నాడు ఉదయమే ఆయన తన మంత్రులను పిలిచి, రాచకార్యాలు చూస్తూ ఉండమని నియోగించి, తన పురోహితుణ్ణి వెంటబెట్టుకుని, తూర్పుద్వారంకుండా నగరం దాటి మారు



వేషంతో బయలుదేరాడు. నగరం వెలపల ఒక ఇంటి ముందు వృద్ధుడొకడు కని పించాడు. ఆయన తన ఇల్లు తాళంపెట్టి, ఇంటిచుట్టూ ముళ్లకంప పెట్టి భార్యా బిడ్డలతో అడవికి పారిపోయాడు. చీకటి పడగానే ఆయన తన ఇంటికి తిరిగివచ్చి, వాకిలి తీయబోతూండగా కాలిలో ఒక ముల్లు గుచ్చుకున్నది. వెంటనే ఆయన నేలపై చతికిలబడి, పాదంలో గుచ్చుకున్న ముల్లును తీసుకుంటూ, "నా అరికాలిలో ఈ ముల్లు గుచ్చుకున్నట్టే పాంచాలరాజుకు యుద్ధంలో బాణం గుచ్చుకొనుగాక!" అని తిట్టుకున్నాడు.

ఈ తిట్టు విని రాజపురోహితుడు ఆ వృద్ధుణ్ణి సమీపించి, "అయ్యా, తమరు వృద్ధులు. కన్ను సరిగా కనిపించక మీరు ముల్లు తొక్కితే అది రాజుగారి దోషం ఎలా అయింది?" అని అడిగాడు.

"రాజు అవినీతిపరుడైనందుచేతనే అధి కారులు దుష్టులైనారు. పగలు రాజభటుల బాధా, రాత్రి దొంగల బాధా భరించలేక ప్రజలు ఇళ్లకు ముళ్లకంపలు అడ్డంపెట్టి, భార్యా బిడ్డలతో అడివికి పారిపోతున్నారు. లేకపోతే నా కాలిలో ఈ ముల్లు విరగవలిసిన పనేమిటీ?" అన్నాడు వృద్ధుడు. రాజు తన పురోహితుడిని సమీపించి అతడి చెవిలో, "ఈ



వృద్ధుడన్న మాటలో నిజం వున్నది. మనం నగరానికి తిరిగి వెళ్లి పరిపాలన సరిగా సాగింతాం!" అన్నాడు.

"ప్రభూ, మీరు తొందరపడకండి!" అంటూ పురోహితుడు రాజును ఇంకొక గ్రామానికి తీసుకుపోయాడు. అక్కడ వారి కొక స్త్రీ కనిపించింది. ఆమెకు యుక్త వయస్సు వచ్చి ఇంకా పెళ్లిగాని కుమార్తెలు ఇద్దరున్నారు. వారిని అడవికి తీసుకుపోవటం ఇష్టంలేక ఆమె తన ఇంటనే దాచివుంచి, వారికి కావలిసిన కట్టెలూ, ఆకులూ తానే తెస్తూవుండేది. ఇప్పుడామె ఏవో ఆకులు కొయ్యటానికి ఒక చెట్టెక్కి దానిపైనుంచి కిందబడి, "ఈ రాజు చచ్చిపోను! వీడు బతికుండగా కన్యలకు పెళ్లిగీతకూడా లేదు!" అన్నది.

ఈ మాటలు విని పురోహితుడు ఆమెను సమీపించి, "బుద్ధిహీనురాలా, రాజ్యంలో ఉండే ప్రతి కన్యకూ భర్తను వెతకటమే రాజుగారి పని అనుకున్నావా?" అన్నాడు.

"అరాజకం పెరిగింది. దుర్మార్గులు విజృంభించారు. పగలు రాజభటుల భయం, రాత్రి దొంగల భయం. కన్యలకు భర్తలెలా దొరుకుతారు?" అన్నదా స్త్రీ.

రాజూ పురోహితుడూ అక్కడినుండి బయలుదేరి ఇంకా ముందుకు వెళ్ళారు.



ఒక పొలాన్ని దున్నుతూ ఒకరైతు వారి కంటపడ్డాడు. అతను దున్నుతూ వుండగానే నాగలికర్ర గుచ్చుకుని ఒక ఎద్దు పడి పోయింది. వెంటనే ఆ రైతు, పట్టలేని కోపంతో "ఈ పాంచాలరాజు గుండెలో బల్లెం గుచ్చుకుని ఇలాగే పడిపోరాదా? మా కష్టాలు తీరుతాయి!" అన్నాడు.

పురోహితుడు రైతుతో, "ఏమోయ్? నీ అశ్రద్ధవల్ల ఎద్దుకు దెబ్బతగిలి పడిపోతే అందులో రాజుగారి తప్పేమిటి?" అన్నాడు.

"రాజుగారి తప్పు కాకపోతే ఎవరి తప్పు? పాలకులు దుర్మార్గులయితే ఒక్కవాళ్లేం బతుకుతారు? పగలు రాజభటుల భయం, రాత్రి దొంగల భయం. మావెట్టిది నాకోసం పండితెచ్చిన కూడు దుర్మార్గులు మెక్కేశారు. మళ్లీ పండి ఎప్పుడు తెస్తుందా అని నేను నోరు తెరుచుకు చూస్తూండటం మూలాన బంగారమంటి ఎద్దుకాస్తా దెబ్బతిని పడి పోయింది!" అన్నాడు రైతు.

ఆ రాత్రికి వారిద్దరూ ఒక గ్రామంలో పడుకున్నారు. మర్నాడు తెల్లవారి లేవగానే వారికొక పాలుపితికేవాడు కనిపించాడు. వాడు పాలు తీస్తూండగా ఆవు ఒక్క తన్ను తన్నింది. పాలుపితికేవాడు ఆ దెబ్బకు అబ్బా అని పెద్దగా మూలుగుతూ వెనక్కు పడి, "ఈ పాంచాలరాజుకుకూడా ఇలాగే



యుద్ధంలో కత్తిపోటు తగిలితే ఎంత బాగుండును!" అన్నాడు.

"నీ ఆవు పాలివ్వక తన్నితే అదికూడా రాజుతప్పేనా!" అన్నాడు పురోహితుడు.

"ఎందుకు కాదూ? పాలకులు దుర్మార్గులైతే ఐక్కవాళ్లేం బతుకుతారు? పాలిచ్చే గొడ్లన్నిటినీ పితికినా వాళ్లే పట్టుకుపోయిరి. ఎన్నడూ పితకని ఆవును పితికితే తన్నదా?" అన్నాడు పాలుపితికేవాడు.

అక్కడినుండి బయలుదేరి రాజూ, పురోహితుడూ తమ రాజధానికి పోసాగారు. దారిలో వారికొక దృశ్యం కనిపించింది. ఒక మడుగులో వున్న కప్పలను, బతికి వుండగానే కాకులు పొడుచుకు తింటున్నాయి.

ఆ కప్పలలో ఒకటి క్రోధావేశంతో, "ఈ కాకులు మమ్మల్ని ఎలా బతికి వుండగానే పీక్కుతింటున్నాయో అలాగే పాంచాల రాజునూ, అతని సంతానాన్నీ శత్రువులు పీక్కుతింటారుగాక!" అన్నది.

"ఓసి మతిమాలిన కప్పా, మిమ్మల్ని పీక్కుతినే కాకుల్ని ఏమీ అనలేక రాజుగారికి శాపనార్థాలు పెడుతున్నావా?" అన్నాడు పురోహితుడు కప్పతో.

దానికి కప్ప, "రాజుగారిని తృప్తిచెయ్యటానికి పురోహితుడు అలాగే అడుగుతాడు, ఆశ్చర్యం లేదు. కాని దేశంలో కాకబలులు కూడా కరువైపోబట్టేగదా కాకులు బతికున్న కప్పల్ని పీక్కుతినే దుస్థితి పట్టింది. అటువంటి దేశాన్ని పాలించేవాడు చస్తే ఎంత మేలు!" అన్నది.

అది విని రాజు, "నన్ను కప్పలుకూడా శపిస్తున్నాయి. ఇక లాభంలేదు. మనం నగరానికి తిరిగివెళ్ళి ఈ అరాజకాన్ని తుదముట్టించుదాం!" అన్నాడు.

ఆ ప్రకారమే ఆయన రాజ్యపరిపాలనలో శ్రద్ధచూపి, లోపాలన్నీ సవరణచేసి, ప్రజలకు శాంతిసౌఖ్యాలు కలిగేలాగు చాలా కాలం పరిపాలన సాగించాడు.






## 11

[పింగళుడు తన తల్లిద్వారా అన్నలు ఆమెను పెట్టిన హింసలు తెలుసుకున్నాడు. కాని, అన్నలు దొంగఏడ్పులు ఏడుస్తూ వచ్చేసరికి, సోదరప్రేమకొద్దీ వారిని యింట్లోకి ఆహ్వానించాడు. వాళ్లిద్దరూ పింగళుడు తెచ్చిన ఆస్తికోసం, అతణ్ణి ఒకానొక ఓడ సరంగుకు బానిసగా అమ్మేందుకు కుట్ర పన్ని, సరంగును కలుసుకున్నారు. తరవాత—]

జీవదత్తుడు తన తమ్ముణ్ణి గురించి చెప్పిన దంతా విని ఓడసరంగు, చేతులు బారచాచి వికటంగా నవ్వాడు. దానిఅంతరార్థమేమిటో తెలీక, జీవదత్తుడూ లక్షదత్తుడూ కళవెళ పడిపోయి ముఖముఖాలు చూసుకున్నారు.

ఓడసరంగు కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత జీవదత్తుడి కళ్లల్లోకి గుచ్చిచూస్తూ, "నువు చెప్పేదంతా నిజమేనా? నిజంగా మీ తమ్ముడు పింగళుడు అనేవాడు, మిమ్మల్ని, మీ తల్లినీ హింసిస్తున్నాడా? నాదగ్గిర అబద్ధాలు పనికి రావు," అన్నాడు.

"నిజం, సరంగుగారూ, నిజం! మా అన్న చెప్పిందాంట్లో ఆవగింజంత అబద్ధంకూడా లేదు. ఇంతకాలంనుంచీ దుష్టుడైన మా తమ్ముడు పెట్టే బాధలను ఎలా భరించుకు వస్తున్నామో ఆ పరమాత్ముడికే ఎరుక!" అన్నాడు లక్షదత్తుడు.

ఓడసరంగు మరోసారి ఆ అన్నదమ్ముల ముఖాలను పరీక్షగా చూసి, తల వూపుతూ,







"అయితే మీ తమ్ముణ్ణి కొనేందుకు నాకు ఏమీ అభ్యంతరంలేదు. వాణ్ణి నా పడవల్లో కళాసుగా రెండుమూడేళ్లు వుంచి, వాడి తిక్క కుదిరి దారికి రాగానే, తిరిగి మీ యింటికి పంపేస్తాను, సరా?" అన్నాడు.

"సరంగుగారూ, మీ పుణ్యం ఉంటుంది, ఆ పనిమాత్రం చేయకండి!" అంటూ జీవదత్తుడు అదిరిపడ్డాడు. "అసలే వాడు పరమ దుర్మార్గుడు. అటువంటివాణ్ణి మీరు రెండు మూడుసంవత్సరాల తరవాత తిరిగి యింటికి పంపితే—వాడు తప్పక మా ప్రాణాలూ, మా తల్లిప్రాణాలూ తీస్తాడు. వాడి పగ తాచుపాము పగ అనుకోండి!" అన్నాడు.



"అలా అయితే, వాణ్ణి నాకు బానిసగా అమ్మేందుకు మీతోపాటు, మీ తల్లికూడా ఒప్పుకుంటుందా? తరవాత రాజుగారిదగ్గిర నామీద వ్యాజ్యంచేస్తే లాభం లేదు. ఆలోచించుకు చెప్పండి," అన్నాడు సరంగు.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ దూరంగా వెళ్లి ఏదో రహస్యంగా మాట్లాడుకున్నట్టు నటించి, తరవాత సరంగుతో వినయం వుట్టి పడేలా యిలా అన్నారు:

"అయ్యా, సరంగుగారూ! అన్ని సంగతులూ మా అమ్మతో మాట్లాడే వచ్చాం. ఆమె వుద్దేశంకూడా ఏదో విధంగా వాణ్ణి యింట్లోనుంచి బయిటికి పంపమనే. ఎంత కన్నకొడుకైనా వాడి దుర్మార్గాన్ని సహించే ఓర్పు యిక ఆమెకు లేదు. అలా అని ఆమెకై ఆమె తన నోటిమీదుగా వాణ్ణి బానిసగా తీసుకుపొమ్మని మీతో చెప్పలేదు. అందుకే మేంయిద్దరం వచ్చాం!"

"అలాగా, సరే! వాణ్ణి యీ సాయంత్రం సూర్యాస్తమయం వేళకు ఏదో వంక పెట్టి సముద్రతీరానికి తీసుకురండి, తరవాత పని నేను చూసుకుంటాను. ఇదిగో వాడికి నే నివ్వదలుచుకున్న ఖరీదు," అంటూ సరంగు వంద మొహరీలు జీవదత్తుడికి యివ్వబోయాడు.



జీవదత్తుడు, సరంగు యివ్వచూపిన డబ్బు తీసుకోకుండా, "అయ్యో, వాణ్ణి మేము సముద్రతీరానికి తీసుకురాగలగడం సాధ్యమయే పని కాదు. వాడిలో వంద నక్కలకుండే జిత్తులూ, ఎనభై ఎనుబోతుల బలమూ వుంది. కనక, మీరే యీ రాత్రికి మా యింటికి వచ్చి వాణ్ణి ఎలాగో చేజిక్కించుకోండి," అన్నాడు.

జీవదత్తుడి భయం చూసి సరంగు బిగ్గరగా నవ్వాడు. "వాడి జిత్తులూ, ఎనభై ఎనుబోతుల బలమూ నాదగ్గిర ఉప్పుగల్లు కూడా మారవు. ఆఖరికి రాక్షసుణ్ణయినా, కంటికి కనబడి, చేతికి అందితే, కాళ్లకూ మెడకూ ఇనపగొలుసులు తగిలించి, నా ఓడలో కళాసుపని చేయిస్తాను. సరే, రాత్రికి మరిద్దరు కళాసుల్ని వెంటబెట్టుకుని మీ యింటికి వస్తాను. మీ యిద్దరూ సర్వ సిద్ధంగా వుండండి," అన్నాడు.

"వెయ్యి నమస్కారాలు. మీ సహాయానికి చాలా కృతజ్ఞులం!" అంటూ జీవదత్తుడూ, లక్షదత్తుడూ ఓడసరంగు యిచ్చిన నూరు మొహరీలూ తీసుకుని, పట్టరాని ఆనందంతో యింటికి బయలుదేరారు.

"ఇప్పుడు మనం పింగళుడికి అనుమానం కలక్కుండా వుండే విధంగా ఏదైనా



యుక్తి పన్నాలి. సరంగు మరిద్దరు కళాసుల్ని వెంటపెట్టుకుని మనింటికి రావటం వాడికి అనుమానకారణం కావొచ్చు!" అన్నాడు లక్షదత్తుడు.

"ఓ, అలాంటి భయం ఏమీ లేదు. దానికి అవసరంఅయిన వుపాయం ముందే ఆలోచించి వుంచాను," అంటూ జీవదత్తుడు ఓసారి చుట్టూ కలయచూచి, లక్షదత్తుడి చెవిలో రహస్యంగా ఏదో చెప్పాడు.

లక్షదత్తుడు పెద్దగా నవ్వుతూ చప్పట్లు చరిచి గంతులేస్తూ, "అన్నా, నువ్వు బుద్ధికి బృహస్పతిని మించినవాడివి, నాకు తెలుసు! పింగళుడు తెచ్చిన డబ్బు మన







వయినప్పుడు, భాగాల్లో నాకేమీ అన్యాయం చేయవుగదా ?" అన్నాడు.

"అన్యాయమా. ఛఛ, సోదరుణ్ణి చూస్తూ చూస్తూ ఎలా మోసపుచ్చుతానురా ? అది మన వంశంలోనే లేదుగదా!" అన్నాడు జీవదత్తుడు.

అన్నదమ్ములిద్దరూ నవ్వుతూ, కేరింతలు కొడుతూ యింటిని సమీపించి, వాకిట్లో పింగళుడు కనిపించగానే, ముఖాలమీద ఎక్క లేని విచారాన్నీ తెచ్చిపెట్టుకుని అతణ్ణి సమీపించారు. పింగళుడు వాళ్ల వాలకంచూసి, "అన్నల్లారా, ఎందుకు అంత విచారంగా వున్నారు? ఏం జరిగింది ?", అని అడిగాడు.

జీవదత్తుడు బొంగురుపోయిన గొంతు పెట్టి, "మరేంలేదు తమ్ముడూ! ఇవ్వాళ దారంట వస్తూంటే మా పాతస్నేహితుడు ఒక ఓడసరంగు కనిపించాడు. అతడు ఈ పట్టణానికి ఏదో వ్యాపారంమీద వచ్చాడట. లోగడ అతడు మా ఇద్దరికీ అనేకసార్లు తన విడిదిలో ఆతిథ్యం యిచ్చి ఎంతో గౌరవించాడు. కాని, బదులుగా అతడికి ఈనాటి వరకూ మేము ఆతిథ్యం ఇవ్వలేకపోయాం. మేము పుట్టుదరిద్రులంగదా ?" అన్నాడు.

"అన్నా, మీ స్నేహితుడు నా స్నేహితుడు కాకుండా పోతాడా? మనం ఇప్పుడు దరిద్రులం ఏమీ కాదు. కావాలంటే అవంతీ



నగరంలో వున్న ప్రతి ఒక్కరికీ మనం రోజూ సంతర్పణ చేయగలం. మీ స్నేహితుడైన ఓడసరంగును అనుచరులతోకూడా, ఈ రాత్రి మన యింటికి విందుకు ఆహ్వానించండి! కావాలంటే విడిదికూడా యిక్కడే ఏర్పాటుచేద్దాం," అన్నాడు పింగళుడు.

"నిజమా, తమ్ముడూ నిజమా?" అంటూ జీవదత్తుడూ, లక్షదత్తుడూకూడా ఎక్కడలేని సంతోషాన్ని నటిస్తూ పింగళుణ్ణి ప్రశ్నించారు.

"నిజం, మీ స్నేహితుణ్ణి తప్పక తీసుకు రండి. మంచి విందు ఏర్పాటు చేద్దాం!" అన్నాడు పింగళుడు.

"సరే, అయితే ఇప్పుడే ఈ సంగతి మా స్నేహితుడితో చెప్పివస్తాం!" అంటూ జీవదత్తుడూ, లక్షదత్తుడూ తిరిగి పట్టణంలోకి బయలుదేరారు.

వాళ్ళిద్దరూ సూర్యాస్తమయంవరకూ జూదగృహాల్లోనూ, పానశాలల్లోనూ కాలం గడిపి, చీకటి పడగానే సరంగు విడిదికి వెళ్ళి, అతణ్ణి బయలుదేరమన్నారు. సరంగు చాలా సంతోషించి, బలశాలులైన ఇద్దరు కళాసుల్ని వెంటబెట్టుకుని అన్నదమ్ముల వెంట బయలుదేరాడు.

సరంగుకూ, అతడి అనుచరులకూ పింగళుడు హృదయపూర్వమైన స్వాగతం





యిచ్చాడు. వాళ్లందరూ ఒకగదిలో సుఖా సీనులైన తరవాత పింగళుడూ, తల్లీ కలిసి మహత్తుగల సంచీనుంచి రకరకాల పదార్థాలూ పానీయాలూ తీసి వాళ్ళకు వడ్డించారు. సరంగుకు మాత్రం సంచీని గురించిన రహస్యం ఏమీ తెలియదు. జీవదత్తుడూ, లక్షదత్తుడూ తనకిలాంటి మర్యాదలు చేస్తున్నారని అతడు భావించాడు.

రాత్రి బాగా పొద్దుపోయేవరకూ అందరూ ఖులాసాగా కబుర్లాడుతూ కాలంగడిపారు. పింగళుడు నిద్రమత్తుతో జోగుతున్నప్పుడు, హఠాత్తుగా మీద పడి అతణ్ణి బంధించి పట్టుకుపోవాలని సరంగు ఎత్తువేశాడు. కాని, ఎంతకీ పింగళుడు నిద్రమత్తు లక్షణాలు కనబరచక, ఉత్సాహంగా కథలూ, కబుర్లూ చెప్పేస్తున్నాడు.

ఇక యిలా కాలం వృథాపుచ్చటం మంచిది కాదని నిర్ణయించుకుని సరంగు తన అనుచరులకూ, జీవదత్తుడికీ లక్షదత్తుడికీ సౌజ్ఞచేశాడు. వెంటనే అందరూ మూకవుమ్మడిగా పింగళుడిమీద పడ్డారు. కొందరు అతడి కాళ్ళూ చేతులూ కదలకుండా పట్టుకున్నారు. జీవదత్తుడూ, లక్షదత్తుడూ అతడు కేకలు పెట్టకుండా నోట్లో గుడ్డముక్కలు కుక్కారు.

పింగళుడు మొదట్లో ఆశ్చర్యపడి నిశ్చేష్టుడయినా, ఆ వెంటనే తెప్పరిల్లి, తనను బంధించేవాళ్లనుంచి విడిపించుకునేందుకు గట్టి ప్రయత్నం చేశాడు. కాని తాను ఒకడు, తనను బంధించ చూచేవాళ్ళు అయిదుగురు! వెంటనే అతడికి తన సేవకుడైన భల్లూకకేతుడు గుర్తుకు వచ్చాడు. ఎలాంటి కష్టంలో వున్నాసరే, ఒకానొక మంత్రం ఉచ్చరిస్తే తను మరునిమిషాన సహాయానికి వస్తానని, అతడు పింగళుడికి ఒక మంత్రం చెప్పివున్నాడు. కాని, ఆ కష్టసమయంలో ఎంత బుర్ర బద్దలుకొట్టుకున్నా, ఆ మంత్రం పింగళుడికి స్ఫురించలేదు. అతడు నిస్స






హాయంగా అన్నల కుట్రకు లోనై, ఓడ సరంగుకు బానిసగా చిక్కిపోయాడు.

పక్కగదిలో నిద్రిస్తున్న తల్లికి యివేమీ తెలియవు. పింగళుణ్ణి కాళ్ళూ చేతులూ కట్టింతరవాత కళాసులు యిద్దరూ కలిసి అతణ్ణి దుంగలాగా భుజాలమీద వేసుకుని తమ యజమాని సరంగు వెనక బయటికి నడిచారు. జీవదత్తుడూ, లక్షదత్తుడూ కూడా వాళ్ళవెనక సముద్రతీరంవరకూ వెళ్లి, ఓడసరంగుతో, "అయ్యా, మావాణ్ణి మాత్రం ఎట్టి పరిస్థితులలోనూ వదలకండి. వాడు విషసర్పం! ఆ సంగతి మీకు లోగడే మనవిచేసుకున్నాంగదా?" అన్నారు.

"విషసర్పం నోరు బిగించాం. ఇక ఆ కోరలు లేకుండా చేయటం ఎలాగో కూడా నాకు తెలుసు. నా పడవలో ఒక సారి తెడువేసే యినపకమ్మికి అతణ్ణి గొలుసుతో బిగించానంటే, ఆ పరమేశ్వరుడు కూడా అతణ్ణి అక్కడనుంచి కదిలించ లేడు," అన్నాడు సరంగు.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ సరంగుకు ఒకటికి రెండుసార్లు కృతజ్ఞత చెప్పుకుని యింటికి వచ్చారు. అప్పటికి యింకా తెల్ల వారనందున కాసేపు నిద్రపోతున్నట్టు నటించి, తెల్లవారగానే అదుర్దాగా తల్లివద్దకు వెళ్ళి, ఆమెను నిద్రలేపి, "అమ్మా, పింగళు డెక్కడ?" అని అడిగారు.

తల్లి వాళ్లకేసి అమాయకంగా చూసి, "ఏం, ఎందుకంత అదుర్దాపడుతున్నారు? వాడి గదిలో నిద్రపోతున్నాడేమో చూడండి," అన్నది.

"గదిలో లేడు. ఇంట్లో మరెక్కడా వున్న జాడకూడా లేదు," అన్నాడు జీవదత్తుడు.

ఆ మాటలతో తల్లికి ఎక్కడలేని భయమూ పట్టుకున్నది. ఆమె హడావిడిగా మంచంలోంచి లేచి యిల్లంతా కలయ వెతి కింది. ఆమె అదుర్దా గమనించిన జీవ దత్తుడు, "అమ్మా, నాకొక అనుమానం







కలుగుతున్నది. తమ్ముడు రాత్రి మన యింటికి వచ్చిన ఓడసరంగుతో కలిసి సముద్ర ప్రయాణానికి వెళ్లివుంటాడేమో!" అన్నాడు అమాయికంగా.

"అంతే జరిగివుండొచ్చు. ఏదో ఒక ద్వీపంలో పెద్ద పాడుబడిన కోటలు వున్నాయనీ, వాటి పునాదుల్లో గొప్పనిధులు వున్నాయనీ సరంగు మనవాడితో చెపుతున్నాడు. అలాటి వాటిని బయటికి లాగటంలో నాది అందెవేసినచేయి, అని పింగళుడు అంటున్నాడు," అన్నాడు లక్షపత్తుడు.

అమాయకురాలైన తల్లికి యిందులో కొంత సత్యం వున్నట్టు తోచింది. ఆమె నిస్పృహగా చేతులు జోడించి, "అవును నాయనలారా! పింగళుడు ఎప్పుడూ అదృష్టవంతుడే! వాడి న్యాయబుద్ధీ, సన్మార్గవర్తనే వాణ్ణి అన్ని ఆపదలనుంచీ కాపాడుతుంది. నా తండ్రి త్వరలోనే తిరిగి వస్తాడు!" అంటూ దేవుణ్ణి ప్రార్థించింది.

తల్లి ప్రవర్తన దుష్టులైన కొడుకులిద్దరికీ పట్టరాని ఆగ్రహం తెప్పించింది. వాళ్ళు తల్లికేసి వికటంగా నవ్వి, "వాడు బుద్ధిమంతుడూ, మేము దుష్టులమూ నన్నమాట? మొదటినుంచీ నువ్వు వాడిమీద పక్షపాతం కనబరుస్తున్నావని మాకు తెలుసు. ఇక యీ యింట్లో మేం క్షణం వుండం. నాన్న వదిలిపోయిన ఆస్తి ఎక్కడ వుందో వెతికి ఎత్తుకుపోతాం," అంటూ బయలుదేరారు.

తల్లి వాళ్ళను వారిస్తూ, "మీనాన్న సంపాయించిన ఆస్తియావత్తూ, మీయిద్దరూ ఎప్పుడో తగలవేశారు. ఈ యింట్లో యిప్పుడున్న డబ్బంతా పింగళుడు కష్టించి సంపాయించుకున్నదే," అన్నది.

ఆ మాటల్తో అన్నదమ్ములిద్దరూ ఉగ్రులైపోయి, తల్లిని నానాతిట్లూ తిట్టి, పింగళుడు మంత్రవేత్త అయిన పద్మపాదుడి నుంచి తెచ్చిన ధనమూ, మహత్తుగల సంచీ వెతికి బయటికి లాగారు. —(ఇంకా వుంది)





# మాయ వర్తకుడు

[ గత సంచిక తరువాయి ]

ఇన్నాళ్ళూ ఆ బిడారుకోసం ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్న వర్తకులు తమ డబ్బు గురించి ఆదుర్దా పడనారంభించారు. వారా ఆందోళనను అలీకి చెప్పుకున్నారుకూడా. ఎందుకంటే అతని మాటలునమ్మే వారు మారుఫ్‌కు అప్పుపెట్టారు.

అలీ మారుఫ్‌ను అవతలికి తీసుకుపోయి, "నీకు పూర్తిగా మతి పోయినట్టుందే? వర్తకులు డబ్బుకోసం తొందర చేస్తున్నారు. నువు వారికి అరవైవేలు బాకీ పడ్డావుట. ఈ సొమ్ముతో ఎంత వర్తకమైనా చేసుకుని ఉండవచ్చు. నువు వట్టి సోమరిపోతులాగా దాన్ని బిచ్చగాళ్లకు పంచిపెట్టావు! ఈ బాకీ ఎలా తీరుద్దామని నీ ఉద్దేశం?" అని గట్టిగా కోప్పడ్డాడు.

"ఏమీ భయంలేదు. ఈ అరవైవేల నగా ఎంత? నా బిడారు రానీ, వర్తకులకు బంగారం కావాలంటే బంగారం ఇస్తాను, సరుకు కావాలంటే సరుకిస్తాను. ఏది కావాలన్నా నాదగ్గిర కొల్లలు, కొల్లలు!" అని మారుఫ్ తాపీగా జవాబిచ్చాడు.

"ఓరి పిడుగా! ఆ కట్టుకథ నాకే చెబుతున్నావా? నీ బతుకు ప్రపంచానికి ఇప్పుడే చాటగలను, జాగ్రత్త, ఏమిటనుకున్నావో!" అన్నాడు అలీ.

"చాల్లే! నేను పేదవాణ్ణనుకున్నావా? అంతులేని సంపద దారిలో ఉందనుకో. నా బిడారు దిగిన మరుక్షణం ఈ వర్తకుల సొమ్ము ఇబ్బడిగా పారేస్తాను!" అన్నాడు మారుఫ్ తొణకకుండా.

"నాతోనే అబద్ధమాడతావురా, దుర్మార్గుడా? చూడు ఏం చేస్తానో!" అని అలీ బెదిరించాడు.

"నువ్వేంచేసినా సరే, నా బిడారు చేరే దాకా ఆ వర్తకులందరూ వేచిఉండక

ఎ. నారాయణశర్మ



టానికి జంకాను. ఎందుకంటే నేనే అతనికి వెయ్యి దీనారాలు అప్పుపెట్టి ఉన్నాను. అసలు మీరు అతనికి అప్పుపెట్టే ముందు నాతో చెప్పిఉండవలసింది. మీ బాకీకి నేను జవాబుదారును కాను; దాన్ని మీరే వసూలు చేసుకోండి. సాధ్యం కాకపోతే సుల్తానుగారివద్దకు వెళ్ళి, అతను వంచకుడనీ, మిమ్మల్ని దగాచేశాడనీ ఫిర్యాదు చేసుకోండి!" అన్నాడు.

వర్తకులందరూ కలిసి సుల్తానుగారివద్దకు వెళ్ళి, తమకూ మారుఫ్‌కూ మధ్య నడిచిన లావాదేవీ అంతా విన్నవించుకున్నారు. "ప్రభూ, ఈ మనిషి పేదవాడను కుందామా అంటే, మా కళ్ల ఎదటే పేదలకు గుప్పిళ్ళతో బంగారం దానం చేశాడు. దరిద్రుడైనవాడు అలా ఎన్నడూ చేయడు. ఈ దాన ధర్మాలకోసం అతను మావద్ద అరవై వేల దీనారాలు అప్పు తీసుకున్నాడు. పోనీ అతను ధనవంతుడే అని తొందర పడకుండా ఉందామంటే, ఎన్నాళ్ళు చూసినా అతని బిడారు జాడ లేకుండా ఉంది!" అన్నారు వారు.

వారు చెప్పేది వింటూంటే సుల్తానుకు మారుఫ్ సాటిలేని ధనికుడన్న నమ్మకం కుదిరింది.

తప్పదు. ఆ తరవాత వారి సొమ్ము వారి కిస్తాను. ఇంకా ఎక్కువే ఇస్తానుకూడా!" అన్నాడు మారుఫ్.

అంతటితో అలీ ఆట కట్టయింది. ఒకప్పుడు తాను ఈ మారుఫ్‌ను చాలా పెద్ద కోటీశ్వరుడుగా పరిచయం చేసి, ఆ నోటితోనే ఇప్పుడతను గర్భదరిద్రుడని సాటి వర్తకులతో చెప్పటం ఎలా?

మిగిలిన వర్తకులంతా అలీ దగ్గిరికి వచ్చి, "మా బాకీ సంగతి ఏమంటాడు? వ్యవహారం ఏమైనా దారిన పడేటట్టుందా?" అని ఆత్రంగా అడిగారు. అలీ నీరసంగా, "అతనితో బాకీ సంగతి నేను ప్రస్తావించ

అయన అసలే లోభి. ఈ మారుఫ్ పేదలకు గుప్పిళ్లతో బంగారం దానం చేస్తున్నాడనేసరికి, అటువంటివాడి వల్ల లాభం పొందాలన్న దురాశ అయనలో తల ఎత్తింది. అయన వర్తకులను పంపేసి, తన వజీరును పిలిచి, "మనం ఈ మారుఫ్ స్నేహం సంపాదించుకోవాలి. అతని బిడారు ఇవాళ కాకపోతే రేపైనా వచ్చి తీరుతుంది. ఈ వర్తకులు గద్దలలాగా పొంచివున్నారు. వారు అతని సరుకు కాజేయకముందే మనం జాగ్రత్తపడాలి. అవసరమైతే అతనికి నా కూతురినిచ్చి పెళ్లిచేసి అతని ఆస్తి మన ఆస్తిలో కలిపేస్తాను!" అన్నాడు.

"మీరు దురాశకు చిక్కి మోసపోకండి, ప్రభూ. ఈ మనిషి వట్టి మోసగాడు!" అన్నాడు వజీరు.

"నేను ముందుగా అతన్ని పరీక్ష చేస్తాను. అందుకు అవసరమైన ఆలోచన చేసే ఉంచాను. అతను మోసకాడని రుజువైతే తల తీసేయిద్దాం!" అన్నాడు సుల్తాను.

వెంటనే వజీరు మారుఫ్‌ను పిలిపించాడు. అతను వచ్చి సుల్తానుకు సలాం చేసి కూర్చున్నాడు.

"నువు ఈ నగరపు వర్తకులకు అరవై వేల దీనారాలు బాకీ పడ్డావుట, నిజమేనా?"



అని సుల్తాను అడిగాడు. మారుఫ్ నిజమే నన్నాడు. "అయితే వారి బాకీ ఎందుకు చెల్లించవు?" అని సుల్తాను మళ్లీ అతన్ని అడిగాడు.

"నా బిడారు వచ్చి దిగగానే వారి బాకీ చెల్లువేస్తాను. బంగారం కావాలంటే బంగారం ఇస్తాను, సరుకు కావాలంటే సరుకిస్తాను. ఏది కావాలంటే అది నాదగ్గిర కొల్లలు కొల్లలుగా ఉంది," అన్నాడు మారుఫ్ తాపీగా.

అతన్ని పరీక్షింతామని సుల్తాను వెయ్యి దీనారాల విలవగల ముత్యాన్ని తీసి అతని కిస్తూ, "ఇలాటి విలువగల ముత్యాలు మీ

బిడారువెంట ఉన్నాయా ?" అని అడిగాడు. మారుఫ్ దాన్ని అటూ ఇటూ తిప్పిచూసి చివరకు ఆ ముత్యాన్ని కాలికింద పెట్టి తొక్కి చితకగొట్టేశాడు.

సుల్తాను మండిపడుతూ, "ఏమిటి నీ ఉద్దేశం ?" అన్నాడు.

"ఎంత విలవ ఉన్నా, ఈ ముత్యం వెయ్యి దీనారాలకన్న ఉండదు. నావద్ద ఇంతకన్న చాలా పెద్ద పెద్ద ముత్యాలున్నాయి," అన్నాడు మారుఫ్.

సుల్తానుకు దురాశ కట్టలు తెగిపోయింది. ఆయన నగరవర్తకులను పిలిపించి, "మీరు మీ సొమ్ముగురించి ఏమీ బెంగపడ నవసరంలేదు. బిడారు తప్పక వచ్చి చేరుతుంది, మీ బాకీలు మీరు వసూలు చేసుకోగలుగుతారు," అని చెప్పాడు.

తరవాత ఆయన తన వజీరును పిలిచి, "మారుఫ్‌ను రాజభవనానికి అతిథిగా అహ్వానించు. అతనితో నా కుమార్తెను గురించి ప్రస్తావించి, పెళ్ళాడటానికి ఇష్టపడతాడేమో తెలుసుకో. అతని అస్తంతా మనం కలుపుకోవచ్చు!" అన్నాడు.

"ప్రభూ, ఈ విదేశీయుణ్ణి చూస్తే నాకు చాలా సందేహంగా ఉంది. అతన్ని రాజభవనంలో అడుగు పెట్టనివ్వటం మంచిది కాదు. ఇంతలో తొందర



ఏమొచ్చింది ? అతని బిడారు వస్తున్న జాడ అయినా తెలిసేదాకా తొందరపడకండి !" అని వజీరు సలహా ఇచ్చాడు.

ఈ సలహా విని సుల్తాను మండిపడ్డాడు. "విశ్వాస ఘాతకుడా, నా కుమార్తెను నువు పెళ్లాడతానని వెనక అన్నావు, దానికి మేం ఒప్పలేదు. ఇప్పుడు ఆమెకు మంచి సంబంధం వస్తే అది ఎలాగైనా పడగొట్టాలని చూస్తున్నావు. నాకుమార్తెకు ఎలాగైనా పెళ్లి యీడు తప్పించి అప్పుడు నీవే పెళ్ళాడా లనుకుంటున్నావు. ఇతను నా కుమార్తెను పెళ్ళాడితే మన మంతా బాగుపడిపోతాం, ఏమనుకుంటున్నావో ?" అన్నాడాయన.

ఇంక ఎదురు చెబితే సుల్తానుకు మరింత కోపం వస్తుందనుకుని, వజీరు తిన్నగా మారుఫ్‌వద్దకు వెళ్లి, "సుల్తానుగారికి తమ కుమార్తెను మీకిచ్చి చేయాలని ఉన్నది. మీ ఉద్దేశం ఎలా ఉందని ఆయనతో చెప్పాలి ?" అని అడిగాడు.

"సుల్తానుగారి ఆదరానికి చాలా కృతజ్ఞుణ్ణి. కాని నా బిడారు వచ్చేదాకా ఆగటం మంచిదికాదా ? రాజకుమార్తెను పెళ్లాడట మంటే దానికి చాలా పెద్ద తతంగం ఉంది. పెళ్లికూతురికి కనీసం అయిదువేల సంచుల బంగారం పెట్టాలి. పెళ్లినాడు నగరంలోని పేదసాదలకు కనీసం వెయ్యి సంచుల





బంగారం దానం చెయ్యాలి. సైనికుల వినో దానికి మరో వెయ్యి సంచుల బంగారం అవసరం. పెళ్లికూతురికి నేను నూరు రత్నాలైనా పెట్టుకోవాలి. దాసదాసీ జనానికంతకూ కలిపి మరో నూరు రత్నాలు బహూకరించాలి. నా బిడారు చేరనిదే ఇదంతా ఎలా సాధ్యం అవుతుంది?" అన్నాడు మారుఫ్ దర్పంగా.

వజీరు ఈ మాటలను సుల్తానుగారికి నివేదించాడు.

సుల్తానుకు తల తిరిగిపోయినంత పని అయింది. అయన మారుఫ్‌ను వెంటనే పిలిపించి, "ఓ వర్తకశేఖరా, ఈ పెళ్లి వెంటనే జరిగిపోవాలి. పెళ్లికయే ఖర్చంతా నేనే భరించుకుంటాను. నా ఖజానానిండా పుష్కలంగా డబ్బున్నది. నీ అవసరాలకు కావలిసింది ఎంతయినా నువు నిరభ్యంతరంగా తీసుకోవచ్చు. పెళ్లికూతురు కివ్వదలచిన కట్నకానుకల సంగతి బిడారు వచ్చినాక చూసుకోవచ్చు. ముహూర్తం వాయిదా వెయ్యటంమటుకు నాకెంత మాత్రమూ ఇష్టంలేదు," అన్నాడు.

మారుఫ్ సరేనన్నాడు. అతనికి సుల్తాను కుమార్తెనిచ్చి వైభవంగా పెళ్లి చేసేటందుకు ఏర్పాట్లు జరిగాయి.

మారుఫ్‌ను పెళ్లికొడుకును చేసి దేవిడీలో ఒక సింహాసనంమీద కూచోబెట్టారు. అతని ముందు గాయకులు పాడారు, నర్తకులు నాట్యం చేశారు, విదూషకులు హాస్యాలు చేశారు, గొప్పగొప్ప మల్లులు కుస్తీలుపట్టారు.

ఆ రోజల్లా అతను ఖజానానుంచి సంచులతో బంగారం తెప్పించి పంచుతూనే ఉన్నాడు. ఖజానానుంచి సంచులు తెచ్చి అందించలేక వజీరు రెక్కలు పడిపోయాయి. అయన మారుఫ్‌దగ్గిరికి వచ్చి అతని చెవిలో, "అల్లా నిన్ను క్షమించడు! నగరవర్తకుల బంగారమంతా అలాములు పలాములు చేసింది చాలక సుల్తానుగారి

ఖజానా అంతా యీవిధంగా గుల్లచేస్తున్నావా ?" అన్నాడు కోపంగా.

"మధ్య నీ సొమ్మేం పోయింది? నా బిడారు రానీ, సుల్తానుగారి సొమ్ముకు వెయ్యింతలు తిరిగి ఇస్తాను," అన్నాడు మారుఫ్.

నలభై రోజులపాటు ఉత్సవాలు జరిగాక పెళ్ళిరోజు వచ్చింది. పెళ్ళి ఊరేగింపులో మారుఫ్ బంగారం రెండుచేతులా వీధులంతటా విదజల్లాడు.

చివరకు పెళ్లికొడుకునూ, పెళ్ళికూతురునీ పడకటింట్లోకి పంపారు. మారుఫ్ మంచానికి ఓమూల దిగాలుపడి కూచుని కంట నీరు పెట్టుకోసాగాడు.

సుల్తానుగారి కుమార్తె అతనిదగ్గిరికి వచ్చి, "ఎందుకలా విచారిస్తున్నారు? మీకేం కష్టంవచ్చింది?" అన్నది.

"అంతా అల్లా నిర్దేశం! కాని ఇలా జరగటానికి తప్పు పూర్తిగా మీ నాన్నదే!" అన్నాడు మారుఫ్.

"ఇప్పుడేం తప్పు జరిగింది?" అన్నది సుల్తానుకుమార్తె.

"జరగక పోవటమేం? నన్ను చూసి అందరూ తిడుతున్నారు. నా బిడారు వచ్చినదాకా ఈ పెళ్లి జరపకుండా ఆపి



నట్టయితే నీకు ఎటువంటి బట్టలు పెట్టేవాణ్ణి, ఎటువంటి నగలు పెట్టేవాణ్ణి! ఇంత వైభవంగా పెళ్లిచేసుకునికూడా, పెళ్లికూతురివైన నీకు ఏమీ పెట్టక లోకానికి పరమ నీచుణ్ణిగా కనిపిస్తున్నాను!" అన్నాడు మారుఫ్ విచారంగా.

"దీనికే ఇంత విచారించాలా?" అన్నది సుల్తానుకుమార్తె.

పెళ్లి అయిన మర్నాడు సుల్తానుగారి నౌకర్లకు, వడ్డించే కుర్రాడు మొదులుకొని వజీరుదాకా ప్రతి ఒక్కరికీ మారుఫ్ బట్టలు పెట్టి బంగారం బహూకరించాడు. ఈ దానధర్మాలు ఇరవై రోజులపాటు సాగాయి.

ఆ తరవాత సుల్తానుగారి ఖజానా ఖాళీ అయిపోయింది. అంతవరకు మారుఫ్ బిడారు జాడలేదు.

వజీరు సుల్తానుతో, "మహాప్రభూ, ఖజానా ఖాళీ అయింది. అల్లుడుగారి బిడారు వచ్చే సూచనలేవీ ఇంతవరకూ లేవు. ఏం చెయ్యాలి ?" అన్నాడు.

సుల్తానుకు యీమాటలు వినగానే కంగారెత్తింది. "అవును, ఏం చేద్దాం ?" అన్నాడాయన అదుర్దాగా.

"ఈ వంచకుణ్ణి నమ్మవద్దని అదివరకే చెప్పాను. నన్నడిగితే ఇతనికి బిడారే లేదంటాను. మిమ్మల్ని మోసగించి, చిల్లిగవ్వ కూడా కట్నం ఇవ్వకుండా మీ కుమార్తెను పెళ్ళాడి, పైపెచ్చు మీ ఖజానా గుల్ల చేశాడు! ఈ పనికిమాలినవాణ్ణి ఇంకెంత కాలం సహించి చూస్తూ వూరుకోవటం? వెంటనే వీడికి తగిన ప్రాయశ్చిత్తం చేయించండి!" అన్నాడు వజీరు.

"అతన్నిగురించి నిజంతెలిస్తే ఎంత బాగుండును!" అన్నాడు సుల్తాను నిస్పృహతో నిట్టూర్చుతూ.

"మహాప్రభూ, భర్త రహస్యాలు భార్య వద్ద దాగవు. అతన్నిగురించి నిజం తెలుసుకునేటందుకు నన్నొక్కసారి మీ కుమార్తెతో మాట్లాడనిస్తారా ?" అని అడిగాడు వజీరు.



సుల్తాను సమ్మతించాడు. ఒక తెర అడ్డం కట్టించినాక, సుల్తానుకుమార్తె వచ్చి తెర వెనక నిలబడింది. వజీరు ఇవతల నిలబడి, "అమ్మా, ఖజానా ఖాళీ అయింది. ఆ పుణ్యం కట్టుకున్నది మీ భర్తే. ఆయనకు ఒక బిడారున్నట్టు అస్తమానం వింటూనే ఉన్నాం గాని ఆ బిడారును కళ్ళచూసిన వారెవరూ లేరు. ఈ మారుఫ్ అనే మనిషినిగురించి మీ కేమి తెలుసు? ఆయన నమ్మదగిన వాడేనా? ఈ విషయాలు దయచేసి చెప్పాలి. ప్రభువువారితో సంప్రతించి వారి అనుమతితోనే నేను మిమ్మల్ని ఈ విధంగా అడుగుతున్నాను," అన్నాడు.

"నాకు అంతులేని ముత్యాలూ, రత్నాలూ, ఆభరణాలూ ఇస్తానని ఆయన రోజూ నాతో అంటూ ఉంటారు. నేను కూడా ఇంకా వాటిని కళ్ల చూడలేదు," అన్నది సుల్తానుకుమార్తె.

"మహారాణీ, ఈ రహస్యం ఏమిటో మీ రివాళే అడిగి తెలుసుకోండి. ఆ రహస్యం ఎవరికీ చెప్పనని ఆయనకు మాట ఇవ్వండి!" అన్నాడు వజీరు.

"అలాగే చేస్తాను"' అన్నది సుల్తాను కుమార్తె.

ఆమె ఆ రాత్రి మారుఫ్‌తో, "మీరు నాతోనైనా నిజం చెప్పి ఉండరాదా? మీకు



బిడారూ, సరుకూ ఏమీ లేదని మా నాన్నకు తెలిసిపోయింది. ఆయన మిమ్మల్ని కఠినంగా శిక్షిస్తాడు. అసలు మీ సంగతి ఏమిటో చెప్పెయ్యండి. వీలయితే మీకు సహాయపడుతాను," అన్నది.

మారుఫ్ ఏమీ దాచకుండా సుల్తానుకుమార్తెకు తన కథయావత్తూ చెప్పేశాడు. అంతా విని ఆమె విరగబడి నవ్వింది. "ఇంత పచ్చిమోసం నేనెన్నడూ వినలేదు. మీరిక్కడ ఉంటే మానప్రాణాలు దక్కవు. వజీరూ, మా నాన్నా కలిసి మిమ్మల్ని హతమారుస్తారు. నా దగ్గిర యాభైవేల దీనారాలున్నాయి. అవి తీసుకుని ఇప్పుడే బయలుదేరి దూరదేశం వెళ్ళిపోండి. అక్కడికి చేరాక మనిషిద్వారా మీ క్షేమం నాకు తెలియజేయండి!" అన్నదామె.

మారుఫ్ ఆ డబ్బు తీసుకుని, బానిసలు వేసుకునే దుస్తులు వేసుకుని, సుల్తానుగారి అశ్వశాలలో ఉన్న గుర్రాలలోకెల్లా మేలుజాతి గుర్రం ఎక్కి ఆ రాత్రే కోట నుంచి పరారీ అయిపోయాడు.

మర్నాడు ఉదయం సుల్తానుగారూ, వజీరూ కలుసుకుని సుల్తానుకుమార్తెను పిలిపించారు. ఆమె తెర వెనక కూచున్న తరవాత సుల్తానుగారు, "అమ్మా, నీ భర్తను గురించి ఏం తెలుసుకున్నావు!" అన్నాడు.



“తప్పుడు మాటలు చెప్పినవాళ్ల నోళ్లు పడిపోతాయి!” అన్నది సుల్తానుకుమార్తె, ఎంతో కోపం నటిస్తూ.

“అదేమిటి?” అన్నాడు సుల్తాను.

“నిన్న రాత్రి నా భర్తకు ఎవరో ఒక ఉత్తరం తెచ్చి ఇచ్చారు. ఆ ఉత్తరాన్ని నేనే తీసుకుని చదివాను. నా భర్త బిడారులో ఉండే అయిదువందలమంది బానిసలూ ఆ ఉత్తరం రాయించి పంపారు. రెండువేల మంది ఎడారి బందిపోటు దొంగలు గుర్రా లెక్కివచ్చి బిడారుమీద దాడి చేశారట. ఘోరంగా యుద్ధం జరిగిందట. ఎంతో మంది బానిసలూ, ఎన్నో కంచరగాడిదెలూ చావటం జరిగిందట. బిడారు వచ్చి చేరటం ఇందుకే ఆలస్యమయింది. డెబ్బైవేల దీనా రాల సరుకు నష్టమయిందని తెలిసికూడా నా భర్త, అదేపాటి నష్టంలే అన్నారు. ఆయన అప్పటికప్పుడే గుర్రం ఎక్కి బయలుదేరి వెళ్లారు. స్వయంగా వెంటఉండి బిడారును మన నగరానికి తీసుకువస్తానన్నారు,” అన్నది సుల్తాను కుమార్తె.

ఈ మాటలు విని సుల్తాను పరమానందం చెందాడు. ఆయన వజీరుకేసి తిరిగి, “ఇక ఎన్నడూ నాకిలాటి అబద్ధాలు చెప్పకు. తెలియకపోతే నోరు మూసుకుని ఊరుకో!” అని మందలించాడు.





ఈ లోపుగా మారుఫ్ తన గుర్రంమీద ఎడారిమార్గం పట్టి వెళ్లాడు. అతని మనస్సు మాత్రం సుల్తానుకుమార్తెమీదే ఉంది. మధ్యాన్నం అయేసరికి అతను ఒక గ్రామం సమీపానికి వచ్చాడు. అతనికి అకలి దహించుకు పోతున్నది.

సమీపంలో ఒక రైతు పొలందున్నుతూ, మారుఫ్‌ను చూసి, "దొరగారికి శుభం కలగాలి!" అన్నాడు. అతను మారుఫ్‌ను చూసి పెద్ద రాజోద్యోగి అయి ఉంటాడనుకున్నాడు.

మారుఫ్ గుర్రం దిగి, "నువ్వెవరు, బాబూ? ఆ కనిపించే గ్రామంలో భోజనశాల ఉన్నదా?" అని అడిగాడు.

"ఈ పొలం నాదే, బాబూ! మాగ్రామం చాలా చిన్నది. ఇక్కడ భోజనశాల లుండవు. అయినా మీకెందుకువచ్చిన శ్రమ. మీరిక్కడే ఉండండి. నేనింటికి వెళ్లి తమకు భోజనం చేయించి పట్టుకొస్తాను. ఆ తరవాత మీ దారిన మీరు పోదురుగాని!" అన్నాడు రైతు.

ఎంతసేపు చూసినా రైతు తిరిగి రాలేదు. తన మూలంగా వాడి పొలంపని నిలిచి పోయినందుకు విచారించి, మారుఫ్ తానే పొలంలోకి వెళ్లి, కాడి పట్టి దున్న సాగాడు.

ఎద్దులు కొంతదూరం వెళ్లేసరికి నాగలికి ఏదో అడ్డం తగిలింది. ఎద్దులు ఎంత బలంగా లాగినా అది ముందుకు పోలేదు.

ఆ అడ్డం తగిలిన దేమిటో చూద్దామని మారుఫ్ పలుగుతో తవ్వి చూసేసరికి ఒక రాతిపలక కనిపించింది. అతను దాన్ని చూసి ఆశ్చర్యపడుతూ, తన బలమంతా వినియోగించి రాతిని పక్కకు తీశాడు. రాతి కింద ఒక నేలమాళిగా, అందులోకి దిగే మెట్లూ కనిపించాయి.

మారుఫ్ మెట్లు దిగి వెళ్లాడు. అడుగున ఒక నలుచదరమైన పెద్ద కొట్టం ఉన్నది. అందులో నాలుగు గదులున్నాయి. వాటిలో బంగారపు కుప్పలూ, ముత్యాలకుప్పలూ, రత్నాల కుప్పలూ ఉన్నాయి. ఎన్నో పందల





"ఏమోయ్, నువు చాలా మంచివాడివి లాగా, తెలివిగలవాడివిలాగా కనబడు తున్నావు. నాదగ్గిర యాభైవేల దీనారా లున్నాయి. వాటిని తీసుకుని ఈ పొలం నాకు వదిలెయ్యి. ఆ డబ్బుతో హాయిగా వర్తకం చేసుకో. పొలం చేసుకుంటే నీకేం వస్తుంది ?" అన్నాడు.

రైతు ఆనందానికి మేరలేదు. మారుఫ్ అతనికి తనకు సుల్తానుకుమార్తె ఇచ్చిన డబ్బంతా ఇచ్చేసి పొలం తనపేర పెట్టించు కున్నాడు. తరవాత అతను ఆ రైతు ఇంటనే కొంతకాలం ఉండి, దొరికిన కంచరగాడిద

సంవత్సరాలక్రితం ఎవరో రాజులు తమ ధనాన్ని ఆ కొట్టంలో దాచుకున్నారు. తర వాత ఆ రాజ్యం పోయింది. ఆ ప్రాంతాన్ని ఎడారి ఆక్రమించింది.

మారుఫ్ తన అదృష్టాన్ని నమ్మలేక పోయాడు. అతను మళ్లీ పైకివచ్చి, రాతిని యథాస్థానంలో పెట్టేసి, దానిపై మన్నుకప్పి, రైతుకోసం ఎదురుచూడసాగాడు.

కొద్దిసేపట్లోనే రైతు రకరకాల ఆహార పదార్థాలను తెచ్చి మారుఫ్ముందు పెట్టి, "బాబూ, తమకోసం ప్రత్యేకంగా వంట చేయించే సరికి ఆలస్యమయింది, మన్నిం చండి !" అన్నాడు.

నల్లా కొనసాగాడు. చిన్నచిన్న బిడార్లు ఆ ప్రాంతంగా వస్తే వాటిని, వాటివెంట ఉన్న బానిసలతో సహా కొనసాగాడు.

ఒక నెలలోపల అతను అయిదువందల కంచరగాడిదలనూ, అయిదువందల బానిస లనూ కొన్నాడు. పొలంలో తనకు దొరికిన రత్నరాసులన్నిటినీ ఆ కంచరగాడిదల మీదికి ఎత్తించి, తిరిగి ఖతాన్ నగరానికి బయలుదేరాడు.

ఈలోపల ఆ నగరంలో సుల్తానుగారు చాలా ఆందోళన చెంది ఉన్నాడు. ఖజానా ఖాళీ అయి నెల రోజులయింది. తన భర్త బిడారును తీసుకురావటానికి వెళ్లాడని





సుల్తానుకుమార్తె చెప్పింది. అతను తిరిగి వస్తాడనీ ధనం తెస్తాడనీ సుల్తాను ఏరోజు కారోజు ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు.

అఖరుకు వజీరు, "మహాప్రభూ, మీ కుమార్తె చెప్పిన అబద్ధాలు నమ్మి మీరు నిష్కారణంగా భ్రమలో పడిపోతున్నారు. మీ అల్లుడుగారు వెళ్లినది బిడారును తెచ్చేటందుకు కాదు, తన ప్రాణం దక్కించుకునేటందుకు! అతనికి బిడారెక్కడిది?" అన్నాడు ఈసడింపుగా.

సరిగా ఆ సమయానికే భటుడొకడు పరిగెత్తుకుంటూ వచ్చి, సుల్తానుగారికి సలాము చేసి, "మహాప్రభూ, అల్లుడుగారు తిరిగి వస్తున్నారు!" అన్నాడు.

సుల్తాను ముఖం విచ్చుకున్నది, వజీరు ముఖం ముడుచుకున్నది. మారుఫ్ వచ్చి సుల్తాన్‌ను కౌగలించుకుని, "నే ననుకున్న దానికన్న చాలా ఎక్కువ నష్టమే జరిగింది. నా సొత్తులో కొద్దిభాగమే దక్కింది. చూతురు గాని రండి!" అంటూ సుల్తాన్‌ను తన వెంట తీసుకువెళ్లాడు.

రాజభవనం ముందు ఆవరణలో మూటలన్నీ దించి ఉన్నాయి. వాటిని తెచ్చిన కంచరగాడిదలు ఒక పక్కగా నిలబడి ఉన్నాయి. ధనరాసులను చూడవచ్చిన నగరంలోని వేలాది జనాన్ని భటులు దూరంగా ఉంచారు.

మారుఫ్ తెచ్చిన రత్నరాసులు చూడగానే సుల్తానుగారికి కళ్ళు చెదిరిపోయాయి. కొన్ని మూటలనిండా అచ్చగా వజ్రాలు, కొన్నిటిలో అచ్చగా వైడూర్యాలు, కొన్నిటిలో మరకతాలు, కొన్నిటిలో పుష్యరాగాలు, కొన్ని సంచులనిండా పోకకాయలంతేసి పెద్ద పెద్ద ముత్యాలు వున్నాయి!

"ఇదంతా నీ సరుకే?" అన్నాడు సుల్తాను ఆశ్చర్యంగా.

"దొంగలు నా బిడారుమీద దాడిచేశారు గదా! అందువల్ల ఇంకా ఇంత సరుకు

పోయింది. పోయింది పోగా మిగిలినదంతా మనసొత్తే!" అన్నాడు మారుఫ్.

సుల్తాను తన వజీరుకేసి తిరిగి, "ఇప్పు డేమంటావు?" అన్నాడు.

"మహాప్రభూ, ఇదంతా చూసి మోస పోకండి. ఇందులో ఏదో మోసం ఉండే ఉంటుంది!" అన్నాడు వజీరు.

"ఈ నీచుణ్ణి తీసుకుపోయి ఉరి తీయించండి!" అన్నాడు సుల్తాను తన భటులతో. వెంటనే వాళ్ళు వజీరును పెడరెక్కలు విరిచికట్టి లాక్కుపోయారు.

అప్పటికప్పుడే సుల్తాను మారుఫ్‌ను తన వజీరుగానూ, తన తరవాత సుల్తాను గానూ ప్రకటించాడు.

మారుఫ్ బిడారు వచ్చి చేరినందుకు పెద్ద విందు జరిగింది. ఆ విందుకు నగరంలో ఉండే వర్తకులందరూ వచ్చారు. వారిలో అలీకూడా ఉన్నాడు. మారుఫ్ అందరి బాకీలూ రెట్టింపుగా చెల్లించాడు.

"తమరి డబ్బు ఎక్కడికీ పోదని మాకు తెలుసు. కాని మేము చిన్న వర్తకులం గనక ఎంతోకాలం ఆగలేక పోయాం!" అన్నారు వర్తకులు.

అలీ ముఖానమటుకు కత్తివాటు వేస్తే నెత్తురుచుక్క లేదు. మారుఫ్ ఈ బిడారూ, ఇంత ధనమూ ఎక్కడనుండి తెచ్చాడో అలీకి తెలియనే లేదు.

అదేవిధంగా సుల్తానుకుమార్తెకూడా ఆశ్చర్యపడింది. "ఈ సొత్తంతా ఎక్కడిది? నా ప్రేమ పరీక్షించటానికి అబద్ధమాడారా?" అన్నదామె తన భర్తతో.

మారుఫ్ ఆమెతో నిజం చెప్పేశాడు. ఆ తరవాత వారు చాలాకాలంపాటు సుఖంగా బతికి అనేకమంది పిల్లలను కన్నారు.

కొన్నేళ్ళ తరవాత మారుఫ్ మామగారు చనిపోయాడు. ఆ నాటినుండీ మారుఫ్ ఖాతాన్ నగరానికి సుల్తానై చాలా ఏళ్ళు ధర్మంగా రాజ్యపాలన చేశాడు.






త్రిలింగదేశంలో చిల్లరరాజుల పరిపాలన అంతమైనాక రాజవంశాలకు చెందినవారం దరూ ఆ కొండమీదా ఆ కొండమీదా కట్టుకున్న కోటలను వదిలేసి గ్రామాలలో స్థిరపడి మామూలు జీవితాలు కొనసాగించారు. కాని వారిలో కొద్దిమందిమటుకు, రాజసం చావక, తమ పాతకోటలనే అంటిపెట్టుకుని, పాతపద్ధతినే జీవిస్తూ వచ్చారు.

ఇలా జీవించినవారిలో ప్రసేనుడు అనే ఆయన ఒకడు. పెద్దమిట్ట అనే కొండమీద ఆయన కోట ఉండేది. కొద్దిమంది నౌకర్లతో ఆయన ఇంకా అక్కడే ఉంటూ, తన బీద బంధువులను సయితం పోషిస్తూ వస్తున్నాడు.

ప్రసేనుడికి ఒక్క కూతురు తప్ప వేరే పిల్లలెవరూ లేరు. ఆ పిల్ల పేరు లలితాంగి. ఆమెకు పెళ్లిచేసి ఒక ఇంటిదాన్నిచేస్తే ఆయన తాను బతికిఉన్నంత కాలమూ నిశ్చింతగా బతకవచ్చు.

అయితే లలితాంగి వివాహం తండ్రికి ఒక పెద్ద సమస్య అయింది. ఆమెను ఎవరికో అనామకుడికి ఇచ్చిచెయ్యటం ఆయనకు ఇష్టంలేదు. పైగా లలితాంగి చాలా అందగత్తె; ఏ చక్రవర్తి కుమారుణ్ణి అయినా చేసుకోదగినటువంటిది. రాజవంశాలకు చెందినవారిలోనే ఆమె భర్తను వెతకాలి. ఆ వంశాలలో సగానికి పైగా శత్రువంశాలు. ఈ శత్రుత్వం కొత్తగా వచ్చినదికాదు, అనేక తరాలుగా ఉంటున్నది.

పెద్దమిట్టకు నాలుగుకోసుల దూరంలో ఎర్రకొండవద్ద జయసింహుడు అనే ఆయన ఉన్నాడు. ఆయన కొడుకు బాలచంద్రుడు చాలా చక్కనివాడనీ, అన్నివిధాలా లలితాంగికి తగినవాడనీ చెప్పుకునేవారు. అయితే జయసింహుడు ప్రసేనుడికి శత్రువర్గంలో వాడు. వారిద్దరూ ఎన్నడూ ఒకరినొకరు చూచుకునికూడా ఎరగరు. ప్రసేనుడి

ఎస్. కుమారస్వామి






ముత్తాతగారి హయాంలో వారికీ వీరికీ పెద్ద యుద్ధం జరిగింది. ఆ తరవాత వారికీ వీరికీ సంబంధాలు లేవు.

చిట్టచివరకు ప్రసేనుడు తన కుమార్తెకు ఒక సంబంధం చూశాడు. పెళ్ళికొడుకుది దూరాన నల్లకొండ. అయినప్పటికీ నల్లకొండ రాజులకూ, పెద్దమిట్ట రాజులకూ అనాదిగా మైత్రి ఉన్నది. వారిదికూడా గొప్ప వంశం. పెళ్ళికొడుకు జయంతుడు పాదుషా కొలువులో ఉంటున్నాడు. అతనుకూడా యువకుడే. అతన్ని పెళ్ళికూతురువైపు వారెవరూ చూసి ఉండలేదు. కాని మనిషి అనాకారి కాడని తెలియవచ్చింది.

ప్రసేనుడు తన మనుషులను నల్లకొండకు పంపి వివాహం స్థిరపరిపించాడు. ముహూర్తం కూడా ఏర్పాటయింది. జయంతుడు పెళ్ళికి రెండురోజులు ముందుగానే తన సిబ్బందితో వచ్చి చేరుతానని కబురు చేశాడు.

తనకు కాబోయే అల్లుణ్ణి గౌరవించటానికి ప్రసేనుడు పెద్దఎత్తున ఏర్పాటు చేశాడు. కోటకు వచ్చే కొండమార్గమంతా శుభ్రం చేయించాడు. దారివెంబడి దివిటీలు ఏర్పాటు చేయించాడు. విందులు జరపటానికి వేటలు సిద్ధం చేయించాడు. పెళ్ళికొడుకు వస్తాడన్న రోజుకు అందరూ అన్ని సన్నాహాలూ పూర్తిచేసుకుని ఎదురుచూశారు. సాయంకాలమయింది. పెళ్ళికొడుకు రాలేదు. చీకటి పడింది. అందరూ నిరాశ చెంది భోజనాలకు కూచున్నారు.

జయంతుడు ముప్ఫైమంది సిబ్బందిని వెంటబెట్టుకుని అనుకున్ననాడే ఇంటినుంచి బయలుదేరాడు. మధ్య దారిలో అతనికి ఒక పాతస్నేహితుడు కలిశాడు. ఆ స్నేహితుడు మరెవరో కాదు, బాలచంద్రుడు.

బాలచంద్రుణ్ణి చూడగానే జయంతుడికి పరమానందమయింది. వారిద్దరూ చిన్నతనంలో ఒకచోట కలిసిఉన్నారు. ఏమంటే వారిద్దరి మేనమామలదీ ఒకఊరే. జయం



తుడు తన స్నేహితుడితో తాను పెళ్లికి పోతున్న సంగతి చెప్పి, "లలితాంగి చాలా గొప్ప సౌందర్యవతి అని విన్నాను. ఆ సంగతి నీకేమైనా తెలుసునా ?" అన్నాడు.

"నేను వినలేదు. నాకు వారి వార్తలేమీ తెలియవు," అన్నాడు బాలచంద్రుడు.

"రేపు సాయంకాలం లోపుగా నేనే స్వయంగా చూస్తాను గద! వారిది చాలా పరువైన వంశం. ప్రసేనుకిడి రాజసం ఏ మాత్రమూ తగ్గలేదని విన్నాను. అటువంటి వారి పిల్లను చేసుకోవటమే గొప్ప విషయం. ఇక పెళ్లికూతురు అందగత్తెకూడా అయితే ఇక చెప్పేదేమిటి? నేను చాలా అదృష్టవంతుణ్ణనుకుంటున్నాను!" అన్నాడు జయంతుడు.

బాలచంద్రుడు తన స్వగ్రామానికి పోతున్నాడు. ఎర్రకొండదాకా ఇద్దరూ కలిసే వెళ్లవచ్చు. చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకుంటూ స్నేహితులిద్దరూ తమ మజిలీ నుంచి ముందుకు సాగారు. జయంతుడు తన పరివారాన్ని వెనకగా రమ్మన్నాడు.

మజిలీనుంచి బయలుదేరిన కొద్దిసేపటికి స్నేహితులిద్దరూ ఒక కనుమ ప్రవేశించారు. తలవని తలంపుగా ఆ కనుమలో వారికి దొంగలు తటస్థపడ్డారు. దొంగలు ఏడెనిమిది




మంది ఉన్నప్పటికీ యువకులు నిర్భయంగా కత్తులు దూసి దొంగలతో యుద్ధానికి తలపడ్డారు. కొద్దిసేపు గడిచాక జయంతుడి సిబ్బంది వచ్చింది. దొంగలు పారిపోయారు.

కాని జయంతుడు తీవ్రంగా గాయపడ్డాడు. ఈ సంగతి బాలచంద్రుడికి దొంగలు పారిపోయాకగాని తెలియరాలేదు. బాలచంద్రుడు ఎక్కిన నల్లగుర్రం చాలా చురుకైనది. అతనుకూడా చాలా పరాక్రమవంతుడు. అందుచేత అతనికి చిన్నగాయం కూడా కాలేదు. జయంతుడు ఎక్కిన తెల్లగుర్రం అంత చురుకైనది కాదు. అతని పొట్టలో కత్తిపోటు తగిలింది.







బాలచంద్రుడు తన స్నేహితుడి గాయానికి కట్టుకట్టి, ఒక చోట పడుకోబెట్టి వీలయిన ఉపచారాలన్నీ చేశాడు. కాని తాను బతకనని జయంతుడికి తెలిసిపోయింది. అతను తన స్నేహితుడితో, "అన్నా, నాకు ఘడియ సమీపించింది. నాకోసం ప్రసేనుడు కనిపెట్టుకుని ఉంటాడు. ఆయన ఎంతో పరువు మర్యాదలు పాటించేవాడు. నువు వెంటనే బయలుదేరి పెద్దమిట్టకు వెళ్లి ఆయనతో ఈ దుస్సంఘటన గురించి చెప్పి, ఆయనకు ఆశాభంగం కలిగించినందుకు నా తరఫున క్షమాపణ వేడు. ఈ పని పూర్తి చెయ్యకుండా మరేపనీ చూడనని నాకు మాట ఇయ్యి. నా శవాన్ని నల్లకొండకు చేర్చ నవసరం లేదు. నా ఉత్తరక్రియలు ఈ కనుమలోనే జరిగేటట్టు చేయి. నల్లకొండకు నా మరణవార్త చేరితే చాలు!" అని చెప్పి జయంతుడు ప్రాణంవదిలాడు.

తన స్నేహితుడి శవానికి దహనక్రియలు జరిపించి బాలచంద్రుడు తన నల్లగుర్రం మీద వేగంగా పెద్దమిట్టకు బయలుదేరాడు. ఒక వంక తన మిత్రుడు చనిపోయాడన్న విచారమూ, ఇంకొక వంక ఈ విషాద వార్తను ప్రసేనుడికి తన నోటిమీదుగా చెప్పాలన్న బాధా, ప్రసేనుడి దృష్టిలో తాను గర్భశత్రువు అన్నదీ అతన్ని బాధించాయి.



దారిలో ఎక్కడా ఆగకుండా ప్రయాణం చేసి అతను రాత్రి జాము పొద్దుపోయి పెద్ద మిట్టమీది కోటను చేరుకున్నాడు. అప్పుడే భోజనానికి కూచున్న ప్రసేనుడి కుటుంబం వారికి గుర్రపు డెక్కల చప్పుడు వినబడింది. మరి కాస్సేపటికల్లా బాలచంద్రుడు వారున్న చోటికి వచ్చాడు.

అతన్ని చూసి అక్కడ ఉన్న అందరూ అతనే పెళ్లికొడుకని అనుకున్నారు. లలితాంగి భోజనంముందునుంచి లేచి అవతలికి వెళ్లిపోయింది. కాని ఆలోపుగా ఆమె అతన్ని బాగానే చూసింది. అతనుకూడా ఆమె అందం చూసి దిగ్భ్రమ చెందాడు.

తరవాత అతను ప్రసేనుడికేసి తిరిగి, "నేను ఇలా వచ్చినందుకు మన్నించాలి. దారిలో అనుకోని సంఘటన ఒకటి జరిగింది !—" అన్నాడు.

"ఆ విషయాలు తరవాత మాట్లాడుకోవచ్చు, నాయనా! ముందు కాళ్లూ చేతులూ కడుక్కుని భోజనంచెయ్యి!" అన్నాడు ప్రసేనుడు.

కొద్దిసేపట్లో బాలచంద్రుడుకూడా భోజనానికి కూచున్నాడు. అతను ఏ పరిస్థితులలోనూ తాను జయసింహుడి కొడుకునన్న విషయం బయటపెట్టి ప్రసేనుడికి అనవసరమైన బాధ కలిగించ దలచలేదు. పోతే,



జయంతుడి మరణవార్తమాత్రం ఏదో విధంగా బయటపెట్టి తాను దాటివెళ్లాలి.

కాని తానే జయంతుడని అక్కడి వారంతా పొరబాటుపడతారని అతను అనుకోలేదు. వారు అలా పొరబడ్డారని భోజనాల దగ్గిర సంభాషణలో అతనికి స్పష్టమయింది.

"పెళ్లికొడుకు అందంలో పెళ్లికూతురికి ఏమంత తీసిపోడులే!" అని ఒకరు అన్నారు.

వెంటనే మరొకరు, "ప్రసేనుడి అదృష్టం! ఆ పిల్ల అదృష్టం!" అన్నారు.

బాలచంద్రుడుకి ఈ మాటలు శూలాల్లాగా తగిలాయి; లలితాంగి అప్పుడే తన



భార్య అయిపోయినట్టు వారంతా మాట్లాడటం అతనికి చెప్పరాని బాధ కలిగించింది. ఎందుచేతనంటే, ఆమెను చూసిన క్షణంలో అతను ప్రేమించాడు. కాని తనకూ ఆమెకూ వివాహంకావటం అసంభవమని అతనికి పూర్తిగా తెలుసు. ప్రసేనుడు ఆత్మహత్య అయినా చేసుకుంటాడుగాని ఆమెను తన కిచ్చి పెళ్లి చేయడు.

భోజనాలు ముగిశాయి. అందరూ లేచారు. బాలచంద్రుడు మెల్లిగా బయటికి జారుకున్నాడు. అతను అక్కడ లేడన్న విషయం ముందు గమనించినవాడు ప్రసేనుడు. ఆయన గబగబా బయటికి వచ్చాడు. బయట దివిటీల వెలుగులో నల్లగుర్రం ఎక్కి, కళ్లాలు బిగలాగి పట్టి, ఎక్కడికో వెళ్లిపోతూ బాలచంద్రుడు కనిపించాడు.

"ఇప్పుడు వచ్చి ఇంతలోనే ప్రయాణం ఎక్కడికి, నాయనా? నీకోసం విడిది ఏర్పాటుచేశాను, రా!" అన్నాడు ప్రసేనుడు.

"లేదు, నేను మీకు ఒకసారి కనపడి పోదామనే వచ్చాను. ఇంక ఒక్క క్షణం కూడా ఉండటానికి ఉత్తరువులేదు. అసలు విషయమేమంటే ఈ ఉదయమే దొంగలు తటస్థపడి నన్ను పొడిచి చంపేశారు. మధ్యాన్నంలోపల నన్ను దహనంచేసేశారు.









ఈ విషయం నన్ను మీరు చెప్పనివ్వక భోజనంచెయ్యమని నిర్బంధించారు. నాకు సెలవిప్పించండి!" అంటూ బాలచంద్రుడు కళ్లాలు వదిలాడు. వెంటనే అతని నల్ల గుర్రం వాయువేగంతో కదిలి చీకటిలో అదృశ్యమయింది.

ప్రసేనుడు ఈ మాటలు విన్న చాలా సేపటిదాకా కొయ్యబొమ్మలాగా అయిపోయాడు. తరవాత అయన లోపలికి వెళ్లి తాను విన్నమాటలు అందరికీ చెప్పాడు. అందరూ నిశ్చేష్టులైపోయారు.

తాను చూసిన పెళ్లికొడుకు దయ్యమని వినగానే లలితాంగి కంటికీ మంటికీ ఏకధారగా ఏడిచింది. ఎందుచేతనంటే ఆమె బాలచంద్రుణ్ణి చూస్తూనే తన భర్తగా వరించింది. వెంటవున్న దాసీజనమంతా ఆమెను అభినందించారు.

జయంతుణ్ణి దొంగలు పొడిచి చంపిన వార్తా, అతనికి దహనక్రియలు జరిగిన వార్తా మర్నాడే రుజువయింది. దానితోబాటు, అ క్రితం రాత్రి వచ్చిన అతిథి దయ్యమన్నది కూడా మరింత రూఢి అయింది.

కొద్దిరోజులు గడిచాయి. లలితాంగికి నిద్రాహారాలు లేవు. ఆమె తాను చూసిన దయ్యంకోసం తపించిపోతున్నది. ఒక వెన్నెలరాత్రి ఆమె తన పడకగది గవాక్షం వద్దకు చల్లగాలికోసం వెళ్లి కిందికి చూసేసరికి, కింద పాదలమధ్యన నల్లగుర్రంమీద, ఆమె మనసులో మెదులుతున్న ఆకారం కనిపించింది. లలితాంగి నోటమాటలేక అలాగే అతనికేసి చూస్తూ ఉండిపోయింది. అతనూ ఆమెకేసి మౌనంగా చూస్తున్నాడు.

ఇంతలో లలితాంగి పరిచారిక, "ఏమిటమ్మా, అదీ?" అంటూ వచ్చి కిటికీలోనుంచి కిందికి చూసింది. వెంటనే అది, "అమ్మయ్యో, దయ్యం!" అని చావుకేక పెట్టి విరుచుకుపడిపోయింది. లలితాంగి ఆ పరిచారిక ముఖాన నీరు చల్లి మళ్ళీ

కిటికీ దగ్గరకువచ్చి బయటికి చూస్తే కింద ఎవరూ లేరు. దయ్యం పెళ్లికొడుకు మళ్లీ కనిపించాడనగానే లలితాంగి తప్ప అందరూ కంగారెత్తిపోయారు. రాత్రిపూట ఆమెవెంట తోడు పడుకోవటానికి పరిచారికలందరూ నిరాకరించారు. ఆ గది వదిలిపెట్టి ఇంకొక చోట పడుకోమంటే లలితాంగి నిరాకరించింది. కారణమేమంటే ఆ దయ్యాన్ని చూడాలని ఆమె తపించిపోతున్నది. దాన్ని పెళ్లాడటానికికూడా ఆమె సిద్ధంగానే ఉంది.

లలితాంగి మనసు మార్చలేక ఆమెను తన పడకగదిలో ఒంటిగా పడుకోనిచ్చారు. వారంరోజులు గడిచాయి. తరవాత ఒక నాడు లలితాంగి మాయమయింది. తెల్లవారి పరిచారికలు గదిలోకి వచ్చి చూసేసరికి గది ఖాళీగా ఉంది.

దయ్యం లలితాంగిని ఎత్తుకుపోయిందన్నారు. చాలామందికి ఆమె ప్రాణాలతో కనిపిస్తుందన్న ఆశకూడా పోయింది. కాని మరోవారం గడిచేసరికి ఎర్రకొండనుంచి ఒక మనిషి లేఖ తెచ్చాడు. ఆ లేఖ రాసినవాడు జయసింహుడు.

"మీ అమ్మాయి లలితాంగి క్షేమంగా ఇక్కడికి చేరింది. మీ అనుమతితో ఆ పిల్లను నా కుమారుడైన బాలచంద్రుడికి చేసుకోవాలని నిశ్చయించాను. ఆ పిల్ల కారణంగా మనమూ మనమూ శాశ్వత మిత్రులము కాగలమని నమ్ముతున్నాను. వివాహానికి మీరు సపరివారంగా వచ్చి వధువుతోబాటు వరునికూడా ఆశీర్వదించ ప్రార్థన !" అని జయసింహుడు రాశాడు.

"నా కూతురు దయ్యాన్ని పెళ్లాడేకన్న శత్రువును పెళ్లాడుతున్నదన్నా నాకు సమ్మతమే. మనం ఈ పెళ్లికి తప్పక పోతున్నాం. జయసింహుడు ఇంత పెద్దమనిషి అని నేను ఎరగను !" అన్నాడు ప్రసేనుడు.

మంచి ముహూర్తాన లలితాంగికీ, బాలచంద్రుడికీ వైభవంగా పెళ్లి జరిగింది.





# చెడ్డవాకిలి-మంచివాకిలి

ఒక గ్రామంలో సంగయ్యా, శరభయ్యా అని ఇద్దరు యువకులుండేవారు. వారు చిన్నతనంనుంచీకూడా ఎంతో ప్రాణస్నేహితులుగా ఉంటూవచ్చారు. కొంత కాలం గడిచాక శరభయ్య ఆ గ్రామం విడిచి తన పొట్టపోసుకునేటందుకుగాను దూర దేశం వెళ్లాడు. సంగయ్యమటుకు తనకున్న పొలాలను చక్కగా పండించుకుని, డబ్బు సంపాదించాడు, గొడ్డూ గోదా అభివృద్ధి చేసుకున్నాడు, పెళ్లిచేసుకున్నాడు, మంచి లోగిలి కూడా కట్టుకున్నాడు. అతని పని బాగున్నది.

గ్రామం విడిచివెళ్లిన ఏడేళ్లకు శరభయ్య ఏదో పనిమీద ఆ ప్రాంతాలకు వచ్చి, చిన్ననాటి స్నేహితుడైన సంగయ్యను చూసి, పలకరించి, క్షేమసమాచారాలు తెలుసుకుపోదామని వచ్చాడు. పూర్వం చిన్న ఇల్లున్న చోట ఇప్పుడు పెద్ద పెంకుటిల్లున్నది. దాని కెదురుగా ఉండిన చింతచెట్టు చాలా పెద్దదయింది. దానికింద ఒక రాతి అరుగు కూడా వేశారు.

"ఫరవాలేదు; సంగయ్య బాగుపడాడు!" అనుకుంటూ శరభయ్య ఇల్లును సమీపిస్తూ ఉండగా, పసారాలోనుంచి ఒక కుక్క బొంయిమని పెద్దగా అరుస్తూ శరభయ్య కేసి రాసాగింది.

కుక్క అరుపు విని సంగయ్య భార్య తలుపు తెరుచుకుని బయటికి వచ్చి, కుక్కను అవతలికి పంపేసి, శరభయ్యకేసి చురచురా చూసింది.

"సంగయ్య ఇల్లు ఇదేనా అమ్మా?" అని శరభయ్య అడిగాడు. ఆమె అవునన్నట్టు తల ఊపింది.

"ఇంట్లో ఉన్నాడా? ఎక్కడి కెళ్లాడో?" అన్నాడు శరభయ్య.

"ఏమో, నాకు చెప్పివెళ్లలేదు!" అన్నది సంగయ్య భార్య.

ఆర్. సరోజిని





"నేనూ సంగయ్యా ఒకప్పుడు విడవని స్నేహితులం. ఏడేళ్లకిందట ఈ గ్రామం విడిచివెళ్లాను. నా చిన్ననాటి స్నేహితుణ్ణి చూసిపోదామని వచ్చాను. సమయానికి అతను ఇంట్లో లేడే!" అన్నాడు శరభయ్య.

సంగయ్య భార్య ఇందుకేమీ అనలేదు. శరభయ్యను లోపలికి రమ్మని ఆహ్వానించ లేదు.

ఎండ మండిపోతున్నది. శరభయ్య చింత చెట్టుకింద అరుగుమీద చతికిలబడి, పైబట్ట చెంగుతో చెమట తుడుచుకుంటూ, "తెలీక అడుగుతున్నాను. సంగయ్యకు నువ్వే మనుతావమ్మా? భార్యవేనా?" అన్నాడు.

ఆమె అవునన్నట్టు తల ఆడించింది.

"బాగుంది. కొత్తగానే పెళ్లి అయినట్టుంది. ఇంకా పిల్లాజెల్లా లేరనుకుంటాను...అబ్బ, ఎండ ఎంత తీవ్రంగా ఉంది! తాగడానికి కాస్త మంచినీళ్లిస్తావా, అమ్మా?" అన్నాడు శరభయ్య.

ఆమె లోపలికి వెళ్లి లోటాలో నీళ్లుతెచ్చి ఇచ్చింది. నీళ్లు బిందెలోవి కావటంవల్ల చల్లగా లేవు. నోట్లో పోసుకుంటే కొద్దిగా వాసనవేసింది. శరభయ్య ఆ నీటిని అవతల పారబోసి లోటా ఆమె కిచ్చేసి, "ఇక నేను బయలుదేరాలి. సంగయ్యను కలుసుకోలేక పోయాను. అతను వస్తే నేను వచ్చివెళ్లానని చెప్పు. నా పేరు శరభయ్య. సంగయ్య పైకి వచ్చినందుకు చాలా సంతోషించానని చెప్పు. ఈ ఇల్లుకూడా చాలా చక్కగా కట్టాడు. కాని నాకు ఈ వాకిలి ఒకటే నచ్చలేదని చెప్పు. ఉన్నమాట దాచకుండా చెప్పేస్తున్నందుకు ఏమీ అనుకోకు. ఈ వాకిలి కొంచెంకూడా బాగాలేదు. నేను వడ్రంగిని. నాకు వాకిళ్ల సంగతి బాగా తెలును. ఈ వాకిలి సంగతి సంగయ్య గమనించాడో లేదో, అది బాగాలేదని నేనన్నట్టు అతనితో చెప్పు!" అంటూ శరభయ్య లేచి తన దారిన వెళ్లిపోయాడు.

అ రాత్రి చీకటి పడినదాకా సంగయ్య ఇంటికి రాలేదు. తాను లేని సమయంలో శరభయ్య వచ్చి మళ్లీ వెళ్లిపోయాడని తెలియగానే అతను చాలా నొచ్చుకుంటూ, "అతన్ని ఉంచలేకపోయావా? ఎందుకు వెళ్లి పోనిచ్చావు? అతను వచ్చి ఏ మన్నాడు?" అని భార్య నడిగాడు.

"మనం పైకివచ్చినందుకు చాలా సంతోషంగా ఉందన్నాడు. ఇల్లుకూడా చాలా బాగుందన్నాడు కాని మన బయటి వాకిలి ఏమీ బాగాలేదన్నాడు. ఆయన వ్రడంగిట. వాకిలి కొంచెంకూడా బాగాలేదని మీతో చెప్పమన్నాడు," అన్నది భార్య.

సంగయ్య ఆశ్చర్యపడుతూ తన యింటి ముఖద్వారాన్ని చాలాసేపు జాగ్రత్తగా పరీక్షించాడు. కాని అందులో అతనికి లోపమేమీ కనిపించలేదు.

ఒక ఏడాది తిరిగి మళ్లీ వేసవి వచ్చింది. శరభయ్య ఇంకొకసారి ఆ ప్రాంతాలకు రావటం జరిగింది. ఈసారయినా సంగయ్యను చూసిపోదామనే ఉద్దేశంతో అతను వారింటికి వెళ్లి బయటినుంచి, "సంగయ్యా!" అని పిలిచాడు.

సంగయ్య భార్య తలుపు తెరుచుకుని పంచలోకి వచ్చి, శరభయ్యను చూసి, "రండి, రండి! లోపలికి రండి!" అన్నది.



"సంగయ్య ఉన్నాడా, అమ్మా? అతడిని చూద్దామని వచ్చాను" అని శరభయ్య వాకిటి ముందే నిలబడి అడిగాడు.

"లేరు, బయటికి వెళ్లారు. త్వరగానే వస్తారు. మీరు లోపలికి రండి!" అన్నదామె ఆప్యాయంగా.

ఎండ మండిపోతున్నది. అయినా శరభయ్య తల అడ్డంగా తిప్పి, "ఎందుకులే? ఈ చెట్టుకింద బాగానే ఉంది," అంటూ అరుగుకేసి వెళ్లసాగాడు.

"మాకు ఇల్లూ వాకిలీ లేనట్టు మీరు చెట్టుకింద కూచోటమేమిటి? లోపలికి రండి," అన్నదామె.

"సరే, నీ యిష్టం!" అంటూ శరభయ్య ఆమెవెంట లోపలికి వెళ్లాడు.

ఇంట్లోపల చల్లగా, సుఖంగా ఉంది. సంగయ్యభార్య అతడికి మంచం వాల్చింది.

"ఈసారయినా సంగయ్య తప్పక కనిపిస్తాడనుకున్నాను. నాకు అతన్ని చూసే గీత ఉన్నట్టు కనబడలేదు," అన్నాడు శరభయ్య.

సంగయ్య భార్య అవతలికి వెళ్లి కొంచెం సేపట్లో ఒక పళ్లెంలో మూడు లోటాలుపెట్టి తెచ్చి అతని ముందు పెట్టింది. వాటిలో చిక్కని మజ్జిగా, కొబ్బరి నీళ్లూ, చల్లని కుండనీరూ ఉన్నాయి.





"ఇవి తీసుకోండి. భోజనం వేళకు ఆయన వస్తారు. అంతదాకా విశ్రాంతి తీసుకోండి! ఎండలో పడి వచ్చారు!" అన్నది సంగయ్య భార్య.

"సంగయ్య భార్య ఎంతగా మారిపోయింది!" అనుకున్నాడు శరభయ్య.

కొంతసేపటికి ఆమె వంట యింట్లోంచి తిరిగి వచ్చి, "వేళ దాటిపోతున్నది. మీరు భోజనానికి లేవండి," అన్నది.

"అప్పుడే ఏం తొందరమ్మా. సంగయ్యను కూడా రానీ!" అన్నాడు శరభయ్య.

"ఆయన ఆకలి ఆయనకే తెలీదు. అయన ఏ వేళకు కొంప చేరతారో! ఆయన కోసం మీరుకూడా తిండీ తిప్పలూ లేకుండా ఉండటం దేనికి. భోజనానికి లేవండి. వంటకాలు వేడిగా ఉండగానే తిందురు గాని!" అన్నది సంగయ్య భార్య.

శరభయ్య నిజంగా చాలా ఆకలిమీద ఉన్నాడు. భోజనం చాలా బాగుంది. భోజనం అయాక శరభయ్య పడుకుని సూర్యాస్తమయ వేళకే లేచాడు.

అప్పటికీ సంగయ్య ఇల్లు చేరనేలేదు.

"ఇక నేను వెళ్ళాలి. సంగయ్యను చూడటం పడనేలేదు," అన్నాడు శరభయ్య

"వెళ్ళిపోకండి. ఈసారికూడా మీరు కనపడకుండా వెళ్ళిపోతే ఆయన చాలా






నొచ్చుకుంటారు. ఈ పూటకు ఉండండి, రేపు పోవచ్చు," అన్నది సంగయ్య భార్య.

"లేదమ్మా, వెళ్ళాలి. నాతో ప్రయాణం చేస్తున్నవారింకా ఉన్నారు. వారు కనిపెట్టు కుని ఉంటారు. నాకూ ఉందామనే ఉంది గాని అది సాధ్యంకాదు. నేను సంగయ్యను మరీమరీ అడిగానని చెప్పు. మీ ఇల్లూ, తోటా చూసి నాకు చాలా ఆనందమయిందని చెప్పు. ముఖ్యంగా మీ వాకిలి చూసి ఎంతో ముచ్చటపడ్డానని చెప్పు. నాకు వాకిళ్ళ సంగతి బాగా తెలుసు. నేను వడ్రంగిని. ఇది చాలా మంచి వాకిలి, భేషైన వాకిలి!" అంటూ శరభయ్య శలవు తీసుకుని అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి సంగయ్య బాగా పొద్దుపోయి ఇంటికి వచ్చాడు. అతని భార్య శరభయ్య వచ్చివెళ్ళిన సంగతి చెప్పి, అతను అన్న మాటలుకూడా చెప్పింది.

అంతా విని సంగయ్య, "శరభయ్య చాలా యోగ్యుడు, మంచి స్నేహితుడు, చాలా తెలివైనవాడుకూడా!" అన్నాడు.

"ఆయన కిందటేడు వచ్చినప్పుడు మన తలవాకిలి ఎంతమాత్రమూ బాగాలేదన్నాడు, ఈయేడు దాన్నే చాలా మెచ్చుకున్నాడు!" అన్నది భార్య.

"కిందటేడు అతను మన వాకిలి బాగా లేదన్నప్పుడు నాకేమీ అర్థంకాలేదు. కాని ఈయేడు వాకిలిని మెచ్చుకునేసరికి నా కంతా అర్థమైపోయింది. అత నలా ఎందు కన్నాడో తెలిసిందా? కిందటేడు అతను వచ్చినప్పుడు నువు అతనికి సరిగా ఆతిథ్యం ఇచ్చి ఉండవు. అందుచేతనే మన ఇంటి ముఖద్వారం అతనికి ఏమాత్రమూ నచ్చ లేదు. ఈసారి సరిగా ఆతిథ్యం ఇచ్చావు కాబోలు, అందువల్లనే అతనికి వాకిలి ఎంతో నచ్చింది!" అన్నాడు సంగయ్య.





# ఇరుకున పడిన ఎలుగుబంటి

ఒకసారి నక్కకు కూరలు పండించాలని తోచింది. అందుచేత తన ఇంటివెనక వున్న దొడ్డియావత్తూ తవ్వి, కూరగాయమొక్కలు వేసింది. అవి పెద్దవై కాయలు కాసే సమయానికి అవి చెట్లమీద మాయం కాసాగాయి.

ఎవరో తన కూరలు దొంగిలిస్తున్నారని తెలుసుకుని నక్క దొంగను పోల్చుకోవటానికి ఎంతో ప్రయత్నించింది. కాని దొంగ ఎవరైనదీ తెలియరాలేదు.

నక్కదొడ్డిలో కూరలు దొంగిలిస్తూ వచ్చినది మరెవరూ కాదు, కుందేలే. కాని కుందేలు ఎంతో మెళుకువతో ఈ దొంగతనం చెయ్యటంవల్ల నక్కకు దొంగ ఆచోకీ తెలియలేదు.

నక్క చిట్టచివరకు దొంగ వచ్చే మార్గం తెలుసుకున్నది. దొడ్డిచుట్టూ వున్న కంచెలో ఒకచోట కంత వున్నది. దొంగ ఆ కంతలో నుంచి వస్తూవుండాలి.

ఈ సంగతి తెలియగానే నక్క దొంగను పట్టటానికి ఒక ఉపాయం చేసింది. కంచె వెంబడి పెరుగుతున్న వెదురుగడకు ఒక తాడు కట్టి దాని చివర ఒక ఉచ్చు పెట్టింది. తరవాత వెదురుగడను వంచి, ఉచ్చు కంత వద్దకు వచ్చేటట్టుగా అమర్చింది. కంతలో నుంచి ఎవరైనా లోపలికి కాలుపెట్టగానే వెదురుగడ పైకి లేచేటట్టు బోను అమర్చి నక్క తనయింట్లోకి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి కుందేలు వచ్చి కంతలోనుంచి ముందుకాళ్ళు దూర్చగానే కుందేలు నడుముకు ఉచ్చు చిక్కుకున్నది; వెదురుగడ పైకి లేచి కుందేలు భూమికి అంతఎత్తున గాలిలో వేళ్ళాడసాగింది.

కుందేలుకు ఏమి చెయ్యాలో పాలుపోలేదు. ఎవరోవచ్చి తనను రక్షిస్తారా అని చుట్టూ చూస్తూండగా, అటుగా ఎలుగుబంటి తేనెతుట్టెలకోసం వెతుకుతూ వచ్చింది.

టి. శంభుదాసు



"ఎలుగుబంటి అన్నా!" అని కుందేలు కేకపెట్టింది.

ఎలుగుబంటి తల ఎత్తిచూసి, ఆశ్చర్యంతో, "అదేమిటి? అక్కడ ఏం చేస్తున్నావు?" అన్నది.

"నక్క పెరడుకు కాపలా కాస్తున్నాను. తెల్లవార్లూ కాపలాకాస్తే రూపాయ ఇస్తుంది నక్క. అయితే చిక్కేమి వచ్చిందంటే నన్నుచూసి దొంగలు భయపడటంలేదు. నీపాటి గాంభీర్యం నాకు లేదాయె. పోనీ ఈ పని నువ్వే చేస్తావా ఏమిటి? పిల్లలు గలవాడివి!" అన్నది కుందేలు.

ఎలుగుబంటికి ఆశ పుట్టింది. అది వెదురు గడను వంచి కుందేలును కిందికి దించి, ఉచ్చులోనుంచి తప్పించి, ఆ ఉచ్చులో తానే ఇరుక్కున్నది.

కుందేలు వెంటనే పరిగెత్తిపోయి నక్కను లేపి, "నక్కబావా, దొంగ ఉచ్చులో పడ్డాడు. చూద్దువుగాని రా!" అని పిలిచింది. నక్క చేతికర్ర తీసుకుని వచ్చి, ఎలుగుబంటిని చూసి, "నీకు ఇదేం రోగం?" అన్నది.

ఎలుగుబంటి ఏదో చెప్పబోయింది. "దాని నోటిమీద కొట్టు!" అన్నది కుందేలు. నక్క ఎలుగుబంటి నోటిమీద కర్రతో కొట్ట సాగింది. ఈలోపల కుందేలు పారిపోయి, దారిలో ఒక మడుగుంటే అందులో ముక్కు దాకా మునిగి కూచున్నది.

కాస్సేపటికి ఎలుగుబంటి జరిగిన సంగతంతా నక్కకు చెప్పి, ఉచ్చునుంచి బయట పడి కుందేలుకోసం వెతుకుతూ బయలు దేరింది. అది మడుగుదగ్గిరికి వచ్చి కుందేలు తల చూసి గోదురుకప్ప అనుకుని, "గోదురు కప్పా, కుందేలు ఇటువచ్చిందా?" అన్నది.

"ఇప్పుడే ఇటు వెళ్ళింది!" అన్నది కుందేలు. ఎలుగుబంటిని తప్పుదారిన వెళ్ల నిచ్చి కుందేలు నిశ్చింతగా తన ఇంటికి వెళ్ళిపోయింది.





# మిత్ర సంప్రాప్తి

బిలములో నుండియే - పిలుచుట విన్న
ఎలుక వాయసముతో - నిట్లని పలికె.

హిరణ్యకం - (ఎలుక)

ఏల వచ్చితివి నీ - వెవరవో యన్న
నాలాటి వానితో-నగు పనియేమి ?

లఘుపతనకం - (కాకి)

నీ లావు తెలిసి నే - నిటకు వచ్చితిని
నీలాటి వారితో - నెంతయో కలదు.
పావురమ్ముల వల - పటపట కొఱికి
నీవు చూపించిన - నెనరు చూచితిని.
వచ్చితి నీమైత్రి - వలయు నటంచు
సచ్చరిత్రుడవు ద-ర్శన మిమ్ము నాకు.

హిరణ్యకం :

మనమెట్లు నేస్తుల-మై మనగలము
తినువాడ వీవు నే-తినబడువాడ.
పగవారితో స్నేహ - బంధ మెట్లగును ?
తగినవారలతోనె - తగు మైత్రి ఎపుడు.

లఘుపతనకం :

నీ పంచ జేరితి - నీ మైత్రి గోరి
నీ పట్టు విడకున్న - నే చత్తు నిచట.

హిరణ్యకం :

వైరితో మైత్రి చే-కూరుట యెట్లు ?
చేరిక పొసగు నా - చెడు కల్గుగాక ?
కాగిన నీళ్ళైన - కడతేర్చు నగ్ని
సాగునా సంధులు - శత్రులతోడ ?

లఘుపతనకం :

చూడనైనను లేదు - వీడెవ్వడనుచు ?
ఏడ శత్రుత్వ ? మే-నెవ్వడ నీకు ?

హిరణ్యకం :

పుట్టుకతో వచ్చు-నట్టి వైరమ్ము
కిట్టక వచ్చెడు-నట్టి వైరమ్ము -
పగ రెండు విధములై - ప్రబలుచు నుండు.
ఒగి పుట్టు పగదీర్ప-నోపరెవ్వారు.
ముంగికి పాముకు - పుట్టు వైరమ్ము

విద్వాన్ విశ్వం





సంగాతులగు నెటు - సర్ప నకులములు.
నీరు నిప్పుల కెట్లు - నెనరులు పుట్టు
కారు, సింహ మ్మేన్గు - ఘనమిత్రు లెపుడు.
కుక్కయు పిల్లియు - చక్కని మైత్రి
ఒక్కటై యుండుట - నొకట విన్నామె?
సహజమ్ము మనకున్న - శత్రుత్వమగుట
బహు వాదమేల? నీ-పనిమీద బొమ్ము.

లఘుపతనకం:

కారణహీనమౌ - వైరమ్ము కలదె?
కారణమే లేక - కార్య మెట్లుండు?
మంచివారల మైత్రి - మఱి వృద్ధియగును
కొంచెపు బుద్ధుల - గూడుట తగదు.
నీవు కోరిన ఒట్టు - నే వేసికొందు
నీవేమి చెప్పిన - నే నొప్పుకొందు.



మంచివాడవటంచు - మైత్రి గోరితిని
వంచనబుద్ధితో - వచ్చుటలేదు.
రావోయి మిత్రుడా - రావోయి మనము
జీవింత మొకటయి - చెలిమి సేయుదము
నీవు కోరినఒట్టు - నేవేసికొందు
నీవేమి చెప్పిన - నే నొప్పుకొందు.

హిరణ్యకం:

ఒట్టులకేమిలే-కట్టులకేమి?
ఒట్టువేసియు వృత్రు - నొంచె నింద్రుండు
నమ్మించి దేవేంద్రు-నంతటివాడె
అమ్మెయి దితి గర్భ - మంతలో దీసె.
సందు చిక్కిన చాలు - శత్రువు లెపుడు
ద్రుందింతు రనుమాట - మఱచుట తగదు.
నమ్మగూడనివాని - నమ్ముటే తగదు;
నమ్మువారిని పూర్తి - నమ్మగారాదు.
విశ్వాసఘాతుకుల్ - వేన వేలుంద్రు
విశ్వసించిన వైరి - వేఱునే నఱకు.

లఘుపతనకం:

ఏడు మాటలతోనె - నేర్పడు మైత్రి
ఏ డడుగులలోనె - నెసగు స్నేహమ్ము
ఇంత సంభాషించి - ఇంతసేపుండి
అంతైన నీ మైత్రి - ననుభవించితిని.
నిను వీడలేకుంటి - నీకు మిత్రుడను
చనుమన్న నెట్లగు - సరికాదు వినుము
నామీద నమ్మిక - ఏమాత్ర యున్న






ఈ మాటకైన స-రే అనుమయ్యా.
కలుగులో నే నిల్చి - పలుకరించుటకు
చెలికాడ ఒప్పుకో-పలెను మ్ము నీవు.
కలుగులో నే నెప్డు - కాలును మోప
బిలముపైనుండి నే - పలుకరించెదను.

హిరణ్యకం:

అంతగా గోరుచు-న్నావు కాబట్టి
ఎంతైన శత్రుజా-తే నీది గనుక
కలుగులోనే ఉండి - పలుకరించెదను.
కలుగులో నీవెప్డు - కాలిడరాదు.
సరి దానికేమిలే - సమ్మతించెదను
వరగోష్ఠి మంచి దె-వ్వారికైనను.

* * *

ఆనాటినుండి వా-యసము మూషికము
ఆనందముగ మాట-లాడుచు గోష్ఠి
పరమ మిత్రమ్ములై - పరగుచునుండె
కరము వారల మైత్రి - ఘనమగుచుండె
ఆ లఘుపతనక-మ్మను కాకి యెపుడు
గాలించి గాలించి - క్రమభక్ష్యములు
మాంసపు ముక్కలు - మఱి చిఱుతిండి
హింసైన పడి తెచ్చి - యిచ్చు నెల్కకును.
ఆ హిరణ్యకమను-నట్టి ఎల్కయును
స్నేహితునకు తిండి - చెచ్చెఱ దెచ్చి
కలుగులోనుండి ఈ-వల బడవేసి
చెలికాడ! తినుమని - చెప్పుచునుండు.

కలది ఇచ్చుట, ఇవ్వ-గలది చేకొనుట,
అల రహస్యము చెప్పు,-టన్నది వినుట,
తినుట కిచ్చుట, ఇచ్చు-తిండిని దినుట,
అను నారు గుణముల - నలరుగా ప్రీతి.
ఉపకారమే లేక - ఉండదు ప్రీతి
ఉపదల దేవత - లొగి సంతసింత్రు.
ఇచ్చునందాక నే - యే ప్రీతియైన
వచ్చు పా లెందాక - వత్స మందాక.
చొప్పవేసిన మాత్ర - చొక్కపుటావు
గొప్పగా పాలిచ్చు - కొడుకున్నగూడ.
అటు వారు దాన ప్ర-త్యాదానములను
చిటి మిత్రులై కడు - చేరిక గనిరి.
ఎలుకకు నమ్మక - మ్మెంతయు గుదిరి
అల కాకి రెక్కలయుం-దుండసాగె.





# ఫలించని తపస్సు

వినుగుచెందని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, శవాన్నిదించి భుజానవేసుకుని, మౌనంగా శ్మశానానికేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల మెచ్చుకోదగినదే గాని ఆఖరు క్షణంలో దీక్షయావత్తూ పోగొట్టుకుని మాండవ్యుడిలాగా అయిపోతావేమో ఆలోచించుకో. నీకు శ్రమ తెలియకుండా వుండగలందులకు ఆయన కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం నైమిశారణ్యంలో మాండవ్యుడనే మహాముని ఉండేవాడు. ఆయనకు ప్రపంచంలో మూర్ఖత్వమూ, మోసమూ, పాపమూ తప్ప ఇంకేమీ లేనట్టు తోచింది. ఇవాళ అమాయికులుగా ఉన్న పిల్లలు, రేపు పెరిగి పెద్దవారై సమస్త పాపాలూ చేస్తారు. ప్రపంచాన్ని చూస్తున్నకొద్దీ ఆయ

## బేతాళ కథలు







నకు సృష్టిమీద రోత పుట్టింది; ఆ సృష్టికి కారకుడైన ఈశ్వరుడిపైన ఆగ్రహం పుట్టుకొచ్చింది. అందుచేత ఆయన ప్రపంచాన్ని నిర్మూలించటానికిగాను శివుణ్ణిగురించి మహాకఠోరమైన తపస్సు ప్రారంభించాడు.

మాండవ్యుడు నైమిశారణ్యంలో ఒక నిర్జన ప్రదేశాన ఒంటికాలిపై నిలబడి, చేతులు పైకెత్తి పద్మంలాగా పెట్టి, నిశ్చల సమాధిలో అతికఠోరంగా తపస్సు చెయ్యసాగాడు. ఈ సమాధిలో వుండి ఆయన, "పరమేశ్వరా, నీవు ఈ సృష్టిని లయం చేసేదాకా నేను చలించకుండా ఈలాగే తపస్సు సాగిస్తాను!" అన్నాడు.

కొంతకాలం గడిచింది. మాండవ్యుడి తపశ్శక్తికి పంచభూతాలూ చలించసాగాయి. భూమి కంపించింది. సముద్రాలమీద తుఫానులు చెలరేగాయి. అగ్నిపర్వతాలు బద్దలయాయి. దండకారణ్యంలో ప్రళయ మారుతం సాగి చెట్లను కూకటివేళ్లతోసహా పెకలించసాగింది.

తనచుట్టూ ఇంత సంక్షోభం జరుగుతున్నా మాండవ్యుడు ఏమాత్రం చలించలేదు. తన తపస్సు ఫలించి ప్రపంచం లయం కాబోతున్నదన్న సంతోషం ఆయనకు మరింత శక్తి కలిగించింది.

ఈ సమయంలో రెండు గువ్వలు ఒక చిన్న పొదలో గూడు నిర్మించటానికి ప్రయత్నం ప్రారంభించాయి. ఆడగువ్వ గుడ్లుపెట్టటానికి సిద్ధంగా వున్నది. త్వరలో గూడుకట్టి, అందులో గుడ్లను పెట్టి పొదిగి పిల్లలను చెయ్యాలి. కాని, గూడు పెట్టటానికి అవి చేసే ప్రయత్నాలు ఫలించలేదు. గాలిమూలాన పొదలో గూడు నిలవటంలేదు.

అవి చుట్టూ చూశాయి. పద్మంలాగా తెరిచిపెట్టిన మాండవ్యుడి చేతులు వాటి కంటపడ్డాయి. మహామహావృక్షాలు గాలికి ఊగిసలాడిపోతున్నప్పటికీ ఆయన చేతులు నిశ్చలంగా వున్నాయి.

రెండుగువ్వలూ ధైర్యంగా ఆయన చేతుల్లో తమ గూడు కట్టుకున్నాయి. ఆ గూడులో పెంటిగువ్వ నాలుగు గుడ్లుపెట్టి, వాటిని పొదిగింది. అవి పిల్లలయాయి. ఆడపక్షీ, మగపక్షీ ఒకదాని తరవాత ఇంకొకటి ఎగిరివెళ్ళి పిల్లలకు ఆహారం తెచ్చిపెట్టేవి. క్రమంగా పిల్లలు పెరిగి పెద్దవికాసాగాయి.

ఇదంతా మాండవ్యుడు గమనిస్తూనే వున్నాడు. తన శరణుజొచ్చిన గువ్వలపైనా, వాటి పిల్లలపైనా, ఆయనకు ఒక చిత్రమైన ప్రేమ ఏర్పడింది. ఒకరోజు ఆకాశంలో నుంచి డేగ ఒకటి రివ్వున గూడుకేసి రావటం చూసి ఆయన తన చేతులను కిందకు దించి, పక్షుల గూడును గట్టిగా తన రొమ్ముకు ఆనించి పట్టుకున్నాడు.

అది మొదలు ఆయన అప్పుడప్పుడూ చేతులు దించి పక్షిపిల్లలు ఎలా పెరుగుతున్నదీ చూసుకుంటూ వుండేవాడు. పక్షులు తెలివితక్కువగా ప్రవర్తించినప్పుడు తనలో తాను నవ్వుకుంటూ వుండేవాడు.

పిల్లలు పెద్దవయాయి, వాటికి రెక్కలు వచ్చాయి. అవి గూడు విడిచి ఎగరదగిన తరుణం వచ్చింది. మగపక్షి గూడుచుట్టూ ఎగురుతూ తిరుగుతూ, "మీరుకూడా నాలాగే ఎగరండి," అన్నట్టు ప్రోత్సహించ





సాగింది. పిల్లలు ఒకటి రెండు రెక్కలు ఎత్తి దించాయి గాని, ఎగరటానికి భయపడ్డాయి. ఆడపక్షి వాటిని గూటినుంచి మెల్లిగా బయటికి నెట్టబోయింది. పిల్లలు మరింత బెదిరాయి. ఆడపక్షీ మగపక్షీకూడా గూడుచుట్టూ ఎగిరాయి. అప్పటికీ లాభం లేకపోయింది.

సరిగా ఈ సమయంలో మాండవ్యుడు జోక్యం కలిగించుకున్నాడు. ఆయన పక్షుల గూటిని ఒక చేతిలో పెట్టుకుని, రెండవ చేతి వేలితో ఒక్కొక్క పిల్లనే గూటినుంచి మెల్లిగా బయటికి తొయ్యసాగాడు. ఒక్కొక్క పిల్లే కింద పడబోవటమూ, మరుక్షణం అదుర్దాగా రెక్కలు కొట్టుకోవటమూ, వెంటనే దానికి ఎగరటం చాతకావటమూ జరిగింది. ఈ విధంగా నాలుగు గువ్వపిల్లలూ కొద్ది సేపట్లోనే ఎగరనేర్చాయి.

మాండవ్యుడి మొహం పరమానందంతో వికసించింది. "పిచ్చి ప్రాణులు! అసహాయ జీవులు! నోరులేని పక్షులు!" అనుకున్నాడాయన. ఆ గువ్వ కుటుంబం తలుచుకుని ఆయన హృదయం ప్రేమతోనూ, జాలితోనూ నిండిపోయింది.

ఇంతలో ఆయనకు అకస్మాత్తుగా తన తపస్సుమాట జ్ఞాపకం వచ్చింది. ఆయన చుట్టూ కలయజూశాడు. గాలి ఎప్పుడో



నిలిచిపోయింది. అంతకు పూర్వం విరిగి పడిపోయిన చెట్లు చిగుర్చుతున్నాయి. ఈశ్వరుడు తన కోరికను నెరవేర్చలేదని మాండవ్యుడికి తెలిసిపోయింది. కాని ఆయన ఆశాభంగం చెందలేదు; ఒక్కసారి పైకి చూసి ఒక చిరునవ్వు నవ్వి, "పరమేశ్వరా, నువ్వీ ప్రపంచాన్ని ఎందుకు లయం చెయ్యటంలేదో నాకర్థమయింది! నీయిష్ట ప్రకారమే జరగనీ!" అంటూ తన ఆశ్రమానికి తిరిగివెళ్లి ఎప్పటిలాగే ఆశ్రమవాసం చేయసాగాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, మాండవ్యుడి తపస్సు భగ్నం కావటానికి నిజమైన కారణమేమిటి? సమాధిలో ఉండి, చేతులు కదిలించటంవల్లనా? గువ్వలను గమనించటంవల్లనా? అంతకాలం కఠోర తపస్సుచేసి ఆయన అర్థం చేసుకున్నదేమిటి? ఈశ్వరుడు ప్రపంచాన్ని ఎందుకు లయం చెయ్యటంలేదు? ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది!" అన్నాడు.

"మాండవ్యుడి తపస్సు భగ్నమైనది గువ్వల మూలంగా. ఆయనకు వాటిపై జాలి కలిగిన క్షణంనుంచీ ఆయన తపస్సు చెయ్యలేదు. మానవమాత్రుడైన మాండవ్యుడికే దిక్కులేని పక్షులపై అంత ప్రేమా, జాలీ ఉంటే, పరమేశ్వరుడికి ప్రాణికోటిపై ఇంకా ఎంత ప్రేమా, ఎంత జాలీ ఉండవచ్చు! తనలాగే ఈశ్వరుడికికూడా ప్రపంచంపై రోత ఉండిఉంటుందనే అపోహతో మాండవ్యుడు తపస్సు ప్రారంభించాడు. కాని ఈశ్వరుడికి ప్రాణికోటియొక్క మూర్ఖత్వాన్నీ, పాపాన్నీ సహించే శక్తి ఉన్నదని తెలుసుకోగానే ఆయన మనసు మారిపోయింది!" అని విక్రమార్కుడు జవాబు చెప్పాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై చెట్టు వద్దకు తిరిగివెళ్ళాడు. —(కల్పితం)






**5**

[అనేక కష్టాలుపడి, అనేక నౌకలనూ, అనేకమంది అనుచరులనూ పోగొట్టుకుని రూపధరుడు సుకేశిని అనే దేవత ఉండే దీవిని చేరుకున్నాడు. తన మనుషులను రెండు దళాలుగా విభజించి, మాయావి అనేవాడి నాయకత్వంకింద ఒక ముఠాను దీవి యూపత్తా కలయజూడటానికి పంపాడు. వారు సుకేశిని ఇంటికి వెళ్లారు. ఆమె వారికి ఆతిథ్యం ఇచ్చి తన మాయాజాలంచేత వారిని పందులుగా చేసేసింది. కాని ఆమె ఎత్తులు రూపధరుడిపై పారలేదు. ఆమె అతనికి ఆప్తురాలుగా మారింది.]

**ఆ**మె సలహా చెప్పినప్రకారం రూపధరుడు, సముద్రతీరాన ఉన్న తన అనుచరుల వద్దకు వెళ్ళాడు. వారు నౌకదగ్గిర విచారంగా కూచునివున్నారు. తమ నాయకుణ్ణి చూడగానే వారికి ప్రాణాలు లేచివచ్చినట్టయింది. తల్లిని చూసిన లేగదూడల్లాగా వారు చెంగుచెంగున గెంతుకుంటూ వచ్చి రూపధరుణ్ణి చుట్టుముట్టారు. ఇథకాకు చేరుకున్నా వారంతకంటె ఎక్కువ సంతోషించి ఉండరు. వారి కళ్లవెంట ఆనంద బాష్పాలు కారుతున్నాయి.

"ఏరీ? మనవాళ్లంతా ఏరీ?" అని వారు రూపధరుణ్ణి అడిగారు.

"మనవాళ్లు సుకేశిని ఇంట్లో క్షేమంగా ఉన్నారు. సుఖంగా తింటున్నారు, తాగుతున్నారు. ముందు మనం మన నౌకను








తీరానికి లాగి మన తాళ్లూ, ఇతర సామగ్రీ ఏదైనా గుహలో భద్రం చెయ్యాలి. తరవాత నేను మిమ్మల్నికూడా సుకేశిని ఇంటికి తీసుకుపోతాను," అన్నాడు రూపధరుడు.

వెంటనే వారు పని ప్రారంభించారు. అయితే మాయావి వారితో ఇలా అన్నాడు:

"మూర్ఖులారా! మీరెక్కడికి పోదామనుకుంటున్నారు? సుకేశిని ఇంటికా? ఆమె మిమ్మల్ని సింహాలూ, తోడేళ్లూ చేసేసి, తన ఇంటి చుట్టూ కాపలాకుక్కల్లాగా కట్టేస్తుంది, ఏమనుకున్నారో? ఫాలలోచనుడి గుహలో ప్రవేశించి మనవాళ్లేమయారో కాస్త జ్ఞాపకం తెచ్చుకోండి. అప్పుడూ ఈ రూపధరుడే పుణ్యం కట్టుకున్నాడు. ఇతని అనాలోచనే వాళ్లని నాశనం చేసింది!"

ఈ మాటలు విని రూపధరుడికి మండిపోయింది. అతను కత్తిదూసి మాయావి కంఠం తెగవెయ్యబోయాడు. కాని మిగిలిన వారు అతన్ని వారించారు. "అతనికి రావటం ఇష్టంలేకపోతే, నౌకను కనిపెట్టుకుని ఇక్కడే ఉండనిద్దాం. మేం నీవెంట సుకేశిని ఇంటికి వస్తున్నాం. మమ్మల్ని తీసుకుపో!" అన్నారు వారు రూపధరుడితో. కాని తీరా అందరూ బయలుదేరాక మాయావి కూడా సుకేశిని ఇంటికి బయలుదేరాడు.

సుకేశిని రూపధరుడి అనుచరుల కందరికీ తలంటి స్నానాలు చేయించి, మంచి మంచి బట్టలు కట్టబెట్టింది. అంతకు మునుపే మాయావివెంట వచ్చినవారు అప్పుడే భోజనాలు చేస్తున్నారు. రెండు ముఠాలవాళ్లూ ఒకరినొకరు చూసుకుని సంతోషం పట్టలేక గోలగా అరవసాగారు.

సుకేశిని రూపధరుడివద్దకు వచ్చి, "మీ వాళ్లు గడిచిపోయిన కష్టాలను మరిచిపోతే బాగుంటుంది. నువ్వూ, నీ అనుచరులూ పడ్డ కష్టాలను నేనెరుగుదును. సుఖంగా తినండి, సారా తాగండి; మీ ఇథకాలో ఉన్నట్టే ఆనందంగా ఉండండి," అన్నది.







రూపధరుడు ఆమె సలహాను పూర్తిగా పాటించి ఒక సంవత్సరంపాటు తన అను చరులతో సహా ఆమెకు అతిథిగా ఉండి పోయాడు. సంవత్సరం పూర్తికాగానే రూప ధరుడి అనుచరులందరూ కలిసి, "ఏమిటిది? మనం ఇక ఇంటికి ప్రయాణమై పోయేది లేదా ఏం?" అన్నారు.

రూపధరుడు సుకేశినితో, "నా అను చరులు స్వదేశానికి పోవటానికి తొందరపడు తున్నారు. నేనిక బయలుదేరటం మంచిది మా ప్రయాణానికి నీ సహాయం కావాలి!" అని అడిగాడు.

"నిన్ను బలవంతాన ఉంచటం నాకిష్టం లేదు. కాని నువు మీ దేశానికి వెళ్లిపోయే ముందు ఇంకొక ప్రయాణం చెయ్యవలసి ఉంది. యములవాళ్లుండే నరకంలో సాంకేతికుడు అనే దివ్యజ్ఞాని ఉన్నాడు. చచ్చిపోయినా అతనికి దివ్యజ్ఞానం పోలేదు. నువు అతణ్ణి ఒకసారి కలుసుకుని అతని సలహా తీసుకోవాలి," అన్నది సుకేశిని.

ఈ మాట వినగానే రూపధరుడు హతా శుడై పోయాడు. "అయ్యో, సుకేశినీ, నరకా నికి ప్రయాణం చెయ్యటం నావల్ల అయే పనేనా? ఎవరైనా నరకానికి నౌకలో వెళ్లి ఉన్నారా?" అని అతను అడిగాడు.



"నువు పడవకు చుక్కానిపట్టి దిక్కులు చూస్తూ కూచోనవసరం లేదు. తెరచాప స్తంభం లేపి, తెరచాప ఎత్తి మాట్లాడకుండా కూచో, ఉత్తరవాయువు నీనౌకను నేరుగా నరకం చేర్చుతుంది. నీ నౌక సముద్రం దాటి నాక తీరం వస్తుంది. అక్కడ నరకవృక్షా లుంటాయి. నీ నౌకను తీరాన కట్టేసి యమ లోకానికి కాలినడకను బయలుదేరు. కొంత దూరం వెళ్ళాక నీకు ఒక గుట్ట కనిపిస్తుంది. దాని సమీపంలోనే అగ్నినదీ, అశ్రునదీ కలిసి వైతరణీనది అవుతుంది. ఆ రాతి దగ్గిర మూరెడు పొడుగూ, మూరెడు వెడల్పూ గల గొయ్యి తవ్వు. ఆ గోతిలో పితృదేవత



లకు తర్పణాలు విడిచి, పిండప్రదానం చెయ్యి. ఈ విధంగా పితృదేవతలను అర్చించి, నిన్ను క్షేమంగా ఇథకా చేర్చమని వారిని ప్రార్థించు. ఇల్లు చేరినాక వారికి బలు లిస్తానని వాగ్దానం చెయ్యి. సాంకేతికుడికి విడిగా ఒక నల్లగొర్రెపోతును బలి ఇస్తానని దణ్ణం పెట్టుకో. తరవాత ఒక నల్ల అడగొర్రెనూ, నల్లగొర్రెపోతునూ అక్కడ బలియిచ్చి అగ్నిలో వేల్చు. ఇలా చేసి యమధర్మరాజుకూ, నరక వాసులకూ, దణ్ణాలు పెట్టుకో. ఇంతలో పితృదేవతలు బలి అరగించటానికి వస్తారు. వారిలో సాంకేతికుడుకూడా ఉంటాడు. ఆయన నీకు



ఇంటికి పోయే ఉపాయమూ, మార్గమూ చెప్పినదాకా పితృదేవతలెవరూ బలులు అంటకుండా చూసుకో!" అని సుకేశిని రూపధరుడికి వివరించి చెప్పింది.

ఇంతలో తెల్లవారింది. రూపధరుడు తన అనుచరులను నిద్రలేవగొట్టి, "నిద్రలేవండి. ఈ ప్రదేశంనుండి మనం బయలుదేరి వెళ్ళాలి. సుకేశిని మనకొక ప్రయాణం కల్పించింది," అన్నాడు.

పాపం, రూపధరుడి అనుచరులు, ఇంటికి బయలుదేరుతున్నాంగదా అని ఎంతో ఉబలాటపడ్డారు. కాని, తాము పోబోతున్నది యములవాళ్ళుండే నరకానికని తెలియగానే వారు మొర్రో అని గోలపెట్టారు. వారిలో కొందరు జుట్టు పీక్కున్నారు. కాని వారు ఆ చోటుకు వెళ్ళక తప్పేది లేదు.

అందరూ కలిసి బయలుదేరి నౌకవద్దకు వెళ్ళేసరికి, అప్పటికే సుకేశిని వచ్చి అక్కడ ఉన్నది. ఆమె ఆ నౌకవద్ద ఒక నల్లని అడగొర్రెనూ, నల్లని గొర్రెపోతునూ ఉంచి, ఎవరితోనూ మాట్లాడకుండా తిరిగి వెళ్ళిపోయింది.

గ్రీకులు తమ నౌకను తీరంనుంచి నీటిలోకి లాగారు, తెరచాప స్తంభం ఎత్తి, తెర విప్పారు. నల్లగొర్రెలను తీసుకుని అందరూ నౌకలోకి ఎక్కారు. సుకేశిని అనుగ్రహం







వల్ల ఉత్తరంనుంచి మారుతం వచ్చి తెర చాపను నింపింది. నౌక కదిలిపోసాగింది.

గాలిపోసుకున్న తెరచాప గాలిపోసుకున్నట్టే ఉంది. సాయంకాలందాకా నౌక తొణుకూ, బెణుకూ లేకుండా ప్రయాణం సాగించింది. తరవాత సూర్యుడు అస్తమించి, అంతటా అంధకారం అవరించింది. ఆ చీకటిలోనే నౌక తీరాన్ని తాకింది.

రూపధరుడు సుకేశిని చెప్పిన ప్రకారమే అగ్నినదీ అశ్రునదీ కలిసే చోట గుండం తవ్వి, తర్పణాలు విడిచాడు, పిండప్రదానం చేసి, పితృదేవతలను ధ్యానించాడు. తరవాత అతను గొర్రెలను బలిఇచ్చి, అగ్నిలో హోమం చేశాడు.

మరుక్షణమే పితృదేవతలు కోలాహలం చేస్తూ, గుంపులు గుంపులుగా బలులు ఆరగించటానికి వచ్చారు. అతను యమధర్మరాజుకూ యములవాళ్ళకూ దణ్ణాలు పెట్టి, పితృదేవతలతో, "నేను సాంకేతికుణ్ణి కొన్ని ప్రశ్నలు వేసేదాకా ఎవరూ బలులు ముట్టటానికి వీల్లేదు!" అన్నాడు.

మిగిలినవారిని తోసుకుంటూ ఒక స్త్రీ ముందుకు వచ్చింది. ఆమెను చూసి రూపధరుడు నిర్ఘాంతపోయాడు. ఎందుచేతనంటే, ఆమె రూపధరుడి తల్లే! రూపధరుడు ట్రోయ్‌పై యుద్ధానికి బయలుదేరే నాటికి ఆమె జీవించే ఉన్నది. ఆమె ఎప్పుడు చనిపోయినదీ రూపధరుడు ఎరగడు.




ఆమెను చూసి రూపధరుడు కంట తడి పెట్టుకున్నాడు, జాలిపడ్డాడు. అయినప్పటికీ అతను ఆమెను బలులు తాకనివ్వలేదు.

ఆమె వెనకనే సాంకేతికుడు, చేతిలో బంగారుకర్ర పట్టుకుని వచ్చాడు. అయన రూపధరుణ్ణి గుర్తించి, "నాయనా, ఎన్నడూ సూర్యకాంతి ఎరగని ఈ పితృలోకానికి నువ్వెందుకు రావలిసివచ్చిందీ? కాస్త అడ్డం తొలిగితే, బలి ఆరగించి నీకు చెయ్యవలసిన సహాయం చేస్తాను" అన్నాడు.








రూపధరుడు పక్కకు తొలిగి ఆయనను బలి ఆరగించ నిచ్చాడు. తరవాత ఆయన రూపధరుడికేసి తిరిగి, "నాయనా, నువు స్వదేశానికి పోవాలని తహతహ లాడు తున్నావు. నిజానికి స్వదేశంకన్న స్వర్గం ఎక్కడుంది? అయితే దేవతలు నీపై అలిగి ఉన్నారు. అందుచేత నువు పడరాని పాట్లు పడతావు, తప్పదు. ఎన్నికష్టాలు పడినా నువు క్షేమంగా ఇంటికి చేరుకుంటావు. నువు ఇంటికి వెళ్లే దారిలో త్రినాపియ అనే దీవి వస్తుంది. అక్కడ సూర్యభగవానుడి తాలూకు పశుగణాలుంటాయి. నువుగాని, నీ అనుచరులుగాని వాటిజోలికి పోవద్దు.



ఒకవేళ ఆ పశువులకు అపచారం జరిగిందో నీ అనుచరులుగాని, నీ నౌకగాని ఇథకా చేరటం కల్ల. నువు మటుకు చావు తప్పి కన్ను లొట్ట పోయినంత పని అయి, ఇంకొకరి నౌకలో ఒంటరిగా ఇంటికి చేరుకుంటావు. అప్పటికీ నీ కష్టాలు అంతం కావు. నీ ఇంటినిండా నీ శత్రువులుండి, తమను పెళ్లాడమని నీ భార్యను పీడిస్తుంటారు. అయితే నువు వీరిని ఎలాగో హత మార్చ గలుగుతావు. ఆ శత్రువుల నందరినీ తుదముట్టించినాక నువు దేవతలపట్ల నీ ధర్మాన్ని నెరవేర్చాలి. అది ఎలా చేయాలో నీకు చెబుతాను. నౌకలు నడిపే తెడ్డు ఒకటి తీసుకుని, అన్నంలో ఉప్పు వాడని వారూ, సముద్రమంటే ఏమిటో ఎరుగని వారూ కనబడేదాకా ప్రయాణం చెయ్యాలి. అటువంటి మనుషులను గుర్తించే మార్గం కూడా నీకు చెబుతాను. వాళ్లు నీ భుజాన ఉండే పడవ తెడ్డును గుర్తించలేక, అది వ్యవసాయపు తెడ్డా అని అడుగుతారు. అటువంటి మనుషులు కనబడిన చోట నీ తెడ్డును భూమిలో గుచ్చి, వరుణదేవుడికి బలులియ్యి. ఒక గొర్రెపోతునూ, ఒక ఎద్దునూ, ఒక ఏదుపందిని బలి ఇచ్చి ఇంటికి తిరిగి వెళ్లు. నువు దీర్ఘకాలం బతికి,







చిట్టచివరకు నువు సముద్రం మూలనే నిశ్చింతగా, సుఖమైన చావు చస్తావు. ఆ సమయంలో నీ అప్తులందరూ నీ చుట్టూ ఉంటారు," అని జోస్యం చెప్పాడు.

"సరే కానివ్వండి. విధిని తప్పించుకోవటం నా వశమా? కాని ఒకటి చెప్పండి. అక్కడ నా తల్లి ప్రేతాత్మ నిలబడి ఉన్నది. ఆమె నాకేసి చూడదు, నాతో మాటాడదు, బలులుకేసి మాత్రమే చూస్తుంది. ఆవిడ నన్ను గుర్తించే మార్గం ఉంటే చెప్పండి!" అన్నాడు రూపధరుడు.

"నాయనా, బలి ముట్టేదాకా పితృదేవతలు నిజం ఏమిటో తెలుసుకోలేరు, చెప్పలేరు. ఆ సంగతి జ్ఞాపకం ఉంచుకో!" అంటూ సాంకేతికుడు యమలోకానికి తిరిగి వెళ్లిపోయాడు.

రూపధరుడు అక్కడే నిలబడి, తన తల్లి వచ్చి బలి ఆరగించేదాకా వేచిఉన్నాడు. బలి ఆరగించగానే ఆమె తల ఎత్తి చూసి తన కొడుకును గుర్తించి, "నాయనా, బతికి ఉండే ఈ లోకానికి ఎలా వచ్చావురా? అది ఎవరికీ సాధ్యం అయే పని కాదే? ట్రోయ్ నుంచి ఇదే రావటమా? ఇంకా ఇథకాకు వెళ్ల లేదా? నీ భార్యను చూసుకో లేదా?" అని అడిగింది.



"లేదమ్మా! నేను ఇల్లు చేరలేక అష్టకష్టాలూ పడుతున్నాను. ఇక్కడ ఉండే సాంకేతికుడి సలహా కోరి నేనిక్కడికి రావలిసి వచ్చింది! చూడమ్మా, నువు ఎలా చని పోయావు? జబ్బు చేసిందా, లేక అకస్మిక మరణం సంప్రాప్త మయిందా? నాన్న ఎలా ఉన్నాడు? నా కొడుకేం చేస్తున్నాడు? వాళ్లు నన్నే నమ్ముకుని నాకోసం ఎదురు చూస్తున్నారా? లేక నేనిక తిరిగి రాననుకుని ఇంకెవరి పంచనైనా చేరారా? నా భార్య ఏమంటున్నది, ఏం చేద్దామనుకుంటున్నది? కొడుకుతో సహా ఆస్తిని చూసుకుంటున్నదా? లేక, ఎవరినన్నా







మంచివాణ్ణి చూసి పెళ్ళాడేసిందా?" అని రూపధరుడు తల్లిని అడిగాడు.

"అది నీ యింటోనే ఉంటున్నది, నాయనా. దాని ఓర్పు ఎటువంటిది దను కున్నావు! అహోరాత్రాలు దాని గుండె దహించుకు పోతున్నదనుకో. నీ ఆస్తీహోదా ఇంకా నీపేరనే ఉన్నాయి. నీ కొడుకు విజ యధ్వజుడు నీ ఆస్తికి హక్కుదారుడుగా ఉంటూ, రాజు చేయవలిసిన పనులన్నీ నిర్వ హించుకుంటూ వస్తున్నాడు. ఇక మీనాన్న అ పల్లెవాసం విడిచి బస్తీకి రారు. ఆయనకు చలికాలంలోకూడా ఒక పక్కా, దుప్పటీ లేదు; పశువుల మధ్య మట్టిలో, చలి మంటకు దగ్గిరిగా పడుకుంటారు. ఇక ఇతర కాలాల్లో ద్రాక్షతోటలో ఎక్కడ బడితే అక్కడే ఆయన పడక. ముసలితనానికి తోడు, నువు రాలేదన్న విచారం ఆయనను కుంగదీసేస్తున్నది. ఇక నా చావు మాటంటావా? నేను ఏ జబ్బుతోనూ తీసు కుని చావలేదు, హఠాత్తుగానూ చావలేదు; నీకోసం బెంగపడి చచ్చాను!" అన్నది రూపధరుడి తల్లి.

రూపధరుడు తల్లిని మనసారా ఒక్కసారి కౌగలించుకుందామని ప్రయత్నం చేశాడు, కాని సాధ్యపడలేదు. మూడు ప్రయత్నాలు చేశాడు, మూడూ విఫలమయాయి.

అప్పుడు రూపధరుడు కళ్ళనీళ్లు పెట్టు కుని తల్లికేసి దీనంగా చూస్తూ, "ఒక్కసారి నన్ను కౌగలించుకో నీవమ్మా! ఎందుకు అందకుండా పోతావు?" అన్నాడు.

"బతికున్నవాళ్లు చచ్చినవాళ్లని ఎలా కౌగలించుకుంటారు, తండ్రీ. నువు కౌగ లించుకోదగినదంతా కాష్ఠంలో కాలి బూడిద అయిపోయింది. వెంటనే ఈ చీకటి లోకం విడిచి వెళ్లిపో, నాయనా! కాని ఇక్కడ చూసిన విషయాలుమాత్రం జ్ఞాపకం ఉంచుకుని, నీ భార్యకు చెప్పు!" అన్నది రూపధరుడి తల్లి. (ఇంకా ఉంది)





# పోయిన ఘడియ

ఒక దేశంకాని దేశానికి రాజుకాని రాజొక డుండేవాడు. ఆయన ఒకనాడు తన పరివారాన్ని వెంటబెట్టుకుని వేటనుంచి తిరిగి వస్తుండగా ఒక ముసలమ్మ తన కొడుకును నానా చీవాట్లూ పెడుతున్నది. రాజు తన గుర్రాన్ని ఆపి, "ఎందు కవ్వా, ఈ కుర్రవాణ్ణి అలా తిట్టిపోస్తున్నావు?" అని అడిగాడు.

"పుట్టక పుట్టక నా కడుపున ఈ వెర్రిబాగులవాడు పుట్టాడు! వీడికి ఏం చెప్పినా తెలీదు, ఏదీ అర్థంకాదు. వీడితో ఎట్లా చావను?" అన్నది ముసలమ్మ.

రాజు తన అనుచరులతో కాస్సేపు రహస్యంగా మాట్లాడి చివరకు ముసలమ్మతో, "నీ కొడుకును బాగుచేసి నేను కొలువులో ఉంచుకుని పోషిస్తాను. వాణ్ణి నావెంట పంపిస్తావా?" అన్నాడు.

"అంతకన్న కావలిసిందేమిటి, నాయనా? తీసుకుపో!" అన్నది ముసలమ్మ.

ఆ ముసలమ్మ కొడుకు పేరు బాబా. వాణ్ణి అస్తమానం ఏడిపించి వినోదం పొందగలందులకై రాజూ ఆయన అనుచరులూ ఈ ఎత్తు వేశారు.

బాబా వచ్చినది మొదలు రాజుగారి ఇంటో ఎవరికీ తోచకపోవటమనేది లేదు. ఎందుచేతనంటే బాబాను వెర్రివాణ్ణి చేసి అందరూ ఏడిపించేవారు. "ఒరే తెల్లకాకి ఈకలు వెంటనే కావాలి, పట్టుకురా!" అనీ, "ఒరే అకుపచ్చ మంధారపూలు తీసుకురా!" అనీ, అర్థంలేని పనులమీద వాణ్ణి పంపించేవారు.

వారు తనను ఏడిపిస్తున్నారని తెలియక బాబా ఏపని చెప్పినా చేసుకురావటానికి బయలుదేరి పోయి, నానాహైరానా పడి వట్టి చేతులతో తిరిగి వస్తూండేవాడు. వాణ్ణి చూడగానే అందరూ పొట్టలు చెక్కలయేటట్టు నవ్వేవారు.

సి. వేణుగోపాలరావు





బాబాను చూసి నవ్వని మనిషి దీదీ ఒక్కతే. ఈమె రాజుగారి వంటయింటో వంట చేస్తూండేది. వయసులో బాబాకన్న కొంచెం చిన్నది. చాలా మంచిది, మంచి అందగత్తెకూడానూ.

దీదీ ఒక్కతే బాబాను చూసి నవ్వేది కాదు. వాడిమీద ఎంతో అదరం చూపేది, కడుపునిండా తిండి పెట్టేది. "నీకు ఒకటీ తెలీదు. వాళ్లంతా ఏది చెయ్యమంటే అదెల్లా చెయ్యటానికి బయలుదేరుతావు. నిన్ను ఏడిపించటానికి వాళ్లు నీకు పనులు చెబుతారు. ఎవరన్నా నిన్ను ఏపనిమీద నన్నా పొమ్మంటే బయలుదేరే ముందు



నాతో చెబుతూ ఉండు," అని దీదీ బాబాకు సలహా ఇచ్చింది.

అదిమొదలు బాబా తనకు ఎవరు ఏపని చెప్పినా ముందు దీదీ సలహా తీసుకుని అమె చెయ్యమన్నట్టు చేస్తూండేవాడు. ఇందువల్ల వాడికి కొంత అనవసర ప్రయాస తప్పుతూండేది.

సాధారణంగా రాజుగారు సూర్యోదయం వేళకే లేచేవాడు. అటువంటివాడు ఒక నాడు ఘడియ పొద్దెక్కి లేచాడు. ఆయన తన పడకగదినుంచి బయటికి వచ్చి తన కోసం వేచివున్న వారితో, "అయ్యో, ఇవాళ ఒక ఘడియ తప్పిపోయిందే?" అన్నాడు ఎంతో విచారంగా.

వెంటనే బాబా, "వెతుక్కురమ్మని సెలవా?" అన్నాడు. అక్కడచేరిన వారందరూ గొల్లున నవ్వారు.

రాజుగారు మాత్రం బాబాకేసి తిరిగి, "వెళ్ళు, తప్పిపోయిన ఘడియను ఏలాగైనా తీసుకురా!" అన్నాడు.

బాబా వంటసాలకు వచ్చి దీదీతో, "దీదీ, నాకు వెంటనే భోజనం పెట్టు. నాకు పని తగిలింది. రాజుగారి ఘడియ ఒకటి తప్పి పోయిందిట. ఎలాగైనా దాన్ని వెతికి పట్టుకు రావాలి!" అన్నాడు.



దీదీకి బాబాను చూసి జాలివేసింది. "నువు వెళ్ళకు. పోయిన ఘుడియ మళ్లీ రావటం ఎక్కడన్నా ఉందా? సాయం కాలం రాజుగారిదగ్గిరికి వెళ్లి, ఎక్కడా కన పడలేదని చెప్పెయ్యి!" అన్నది.

బాబా మొండిగా, "పోయిన ప్రతి వస్తువూ దొరుకుతుంది. రాజుగారు అడగకముందే నేను తెస్తానని మాట ఇచ్చాను. వెళ్ళి తీరాలి!" అన్నాడు.

పిచ్చివాడితో వాదించి లాభంలేదు. అందు చేత దీదీ ఒక్కనిట్టూర్పు విడిచి బాబాకు భోజనం పెట్టింది.



బాబా త్వరత్వరగా భోజనంముగించి సరాసరి రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా! నేను బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నాను!" అన్నాడు.

రాజుగారి సభికుల్లో ఒకడు బాబాకు తన కుంటిగుర్రాన్ని ఇచ్చాడు. ఇంకొకడు తుప్పుపట్టిన కత్తి ఇచ్చాడు. ఆ కత్తి తీసు కుని, కుంటిగుర్రంమీద ఎక్కి బాబా వెళ్ళి పోతుంటే రాజుగారితోపాటు సభికులుకూడా విరగబడి నవ్వారు.

బాబా చాలాదూరం వెళ్లాక ఎదురుగా వస్తూ ఒక ముసలివాడు కనిపించాడు. "తాతా, నేను తప్పిపోయిన ఘుడియకోసం వెతుకుతున్నాను. అది నీ కెక్కడైనా కనిపించిందా?" అని అడిగాడు బాబా.

దానికి ముసలివాడు, "నీ ముష్టి ఘుడి యకు విలువ ఏమిటి? నా ప్రతిష్ఠ కాస్తా పోయింది. దానికోసం దేశాలుపట్టి తిరుగు తున్నాను. నా ప్రతిష్ఠ నీ కెక్కడైనా కన బడిందా?" అని అడిగాడు.

తనకు కనబడలేదని చెప్పి బాబా ముందుకు సాగాడు. మరికొంత దూరం వెళ్లాక అతనికి ఒక అజానుబాహువు, రుస రుస లాడుతూ అతివేగంగా ఎదురు వచ్చాడు. అతని కళ్లు చింతనిప్పుల్లా ఉన్నాయి. కను బొమలు ముడిపడి ఉన్నాయి.

"బాబూ, మీ కెక్కడైనా తప్పిపోయిన ఘుడియగాని కనబడిందా?" అని అడిగాడు బాబా ఎంతో వినయంగా.

ఎదురుగా వచ్చే మనిషి మండిపడుతూ, "నాకు నీ వెధవ ఘుడియతో ఏం పని? నా ఓర్పు కాస్తా ఎక్కడో పోగొట్టుకున్నాను. అది ఎంత వెతికినా దొరకటంలేదు. నీకు కనపడిందా?" అన్నాడు.

"లేదు!" అన్నాడు బాబా భయపడుతూ.

"ఈ భాగ్యానికి నన్నెందుకాపావు?" అంటూ ఆ మనిషి తన చేతికర్రతో బాబాను చావగొట్టబోయాడు. అది చూసి బాబా ఎక్కిన కుంటిగుర్రం బెదిరి దౌడుతీసి, కొంత సేపటికి సముద్రతీరాన గల జీజీ నగరం చేరింది.

బాబా నేరుగా రాజుగారి వద్దకు వెళ్లి, "నేను మా రాజుగారు పోగొట్టుకున్న ఘుడియకోసం వెతుకుతున్నాను. దాన్ని పట్టుకోవటానికి మీరేమైనా సహాయపడగలరా?" అని అడిగాడు.

రాజుగారు కంట నీరు పెట్టుకుంటూ, "నేను నీకేం సహాయం చెయ్యను, నాయనా? పదిహేనేళ్ళక్రితం నా కూతురు తప్పిపోయింది. ఎంత వెతికినా దొరకలేదు. నీ ఘుడియకోసం వెతికేటప్పుడు నా కూతురు జాడకూడా విచారించుదూ!" అన్నాడు.



"అలాగేలేండి!" అని బాబా జీజీరాజు గారివద్ద సెలవు తీసుకుని అక్కడినుంచి ముందుకు సాగివెళ్ళాడు.

సముద్రతీరాన బాబాకు ఒక పడవ కనిపించింది. అందులో నావికులు సరుకు ఎక్కిస్తున్నారు. బాబా వారిదగ్గిరకు వెళ్ళి వారితో తాను వెతుకుతున్న ఘడియగురించి చెప్పాడు. "అది దొరికితే ఎక్కడో సముద్రాలమీదే దొరకాలి. కావలిస్తే మా పడవలో ఎక్కరా!" అన్నారు నావికులు.

బాబా అమాయకుడనీ, వాడిచేత అన్ని పనులూ ఊరికే చేయించుకోవచ్చుననీ, నావికులు తెలుసుకున్నారు.

బాబా వారి మాటలు నమ్మి పడవలో ఎక్కి బయలుదేరాడు. నడిసముద్రంలో పెద్ద తుఫాను చెలరేగి పడవ కొన్ని కొండలకు తగిలి ముక్కలుముక్కలైపోయింది. బాబా తప్ప అందరూ చచ్చిపోయారు. సముద్రపు కెరటాలు బాబాను ఒక విచిత్రమైన లంకమీద పడవేశాయి.

అది కాలదేవుడుండే లంక. బాబా ఆ లంకమీద ఎంతదూరం వెళ్ళినా నల్లరాళ్ళ గుట్టలు తప్ప ఏమీ కనిపించలేదు. ఆ గుట్టల మధ్యగా అతను నానా ప్రయాసాపడుతూ రాత్రల్లా నడిచి సూర్యోదయం వేళకు ఒక వింత చూశాడు.





బాబాకు ఎదురుగా ఒక కోట ఉన్నది. ఆ కోట తలుపులు అతను చూస్తుండగానే తెరుచుకుని ఒక తెల్లగడ్డం గల ముసలివాడు వచ్చాడు. అయన వెంబడి ఒక గుర్రంమీద ఎక్కి, తెల్లని దుస్తులు ధరించి ఒక యువకుడు నిలబడ్డాడు. అతని చుట్టూ అరవై మంది కుర్రవాళ్లు అతనిలాగే తెల్లదుస్తులు ధరించి, తెల్లని పొట్టిగుర్రాలెక్కి ప్రయాణానికి సిద్ధంగా ఉన్నారు.

ముసలివాడు సంజ్ఞ చెయ్యగానే గుర్రాల మీద ఉన్నవాళ్ళందరూ శరవేగంతో కదిలి బాబా పక్కగా వెళ్ళిపోయారు. బాబా ముందుకు వచ్చి వృద్ధుణ్ణి సమీపించి, "అయ్యా, మీ రెవరు? ఇప్పుడు తెల్లగుర్రా లెక్కి వెళ్ళినవారంతా ఎవరు? ఇది ఏదేశం?" అని అడిగాడు.

"నేను కాలదేవుణ్ణి. ఇది నేనుండే ప్రదేశం. ఇప్పుడు వెళ్ళిన యువకుడు మొదటి ఘడియ. వాడివెంట ఉన్న కుర్ర వాళ్ళందరూ విఘడియలు," అన్నాడు ముసలివాడు.

ఈ మాట వినగానే బాబాకు తాను బయలుదేరిన పని జ్ఞాపకం వచ్చింది. "అన్నట్టు మా రాజుగారు ఒక ఘడియ ఎక్కడో పోగొట్టుకున్నారు. అది వెతికి పట్టుకురమ్మని నన్ను పంపారు. మీరు నాకు సాయం చెయ్యగలరా?" అని అతను కాల దేవుణ్ణి అడిగాడు.

"అది నాచేతిలో ఉన్నపనే, నాయనా. నువు నా వెంట లోపలికి రా!" అన్నాడు కాలదేవుడు.

లోపల పెద్ద భవనం ఉంది. ఆ భవనంలో ఘడియలూ, విఘడియలూ ఉన్నారు. రాత్రి ఘడియలు నల్లదుస్తులు ధరించారు, పగటివారు తెల్లనివి ధరించారు.

కాలదేవుడు వేళకు తగినట్టు ఘడియలనూ విఘడియలనూ పంపుతూ ఉంటాడు. ఇదే ఇక్కడి కార్యక్రమం.

అందరూ బాబా పట్ల చాలా ఆదరం చూపారు. కాలదేవుడి ఆజ్ఞప్రకారం వారు బాబాను మరమ్మతు చేసి అతన్ని తెలివి గలవాణ్ణిగా మార్చేశారు. కాలం చెయ్యి లేని మరమ్మతు ఏముంటుందీ?

అక్కడ కొద్దికాలం ఉండి బాబా ఒక నాడు కాలదేవుడితో, "అయ్యా, నన్నిక పంపించండి!" అన్నాడు.

కాలదేవుడు బాబాకు ఒక చిన్న డబ్బి ఇస్తూ, "మీ రాజుగారు పోగొట్టుకున్న ఘడియ ఇందులో ఉంది. అవసరం వచ్చే దాకా ఈ డబ్బి మూతమాత్రం తెరవకు!" అని హెచ్చరించాడు.

"అయ్యా, నేను వచ్చేటప్పుడు ఒక వృద్ధుడెదురై, తన ప్రతిష్ఠను పోగొట్టుకున్నానని చెప్పాడు. దానికోసం, పాపం, అయన దేశదేశాలూ తిరుగుతున్నాడు. అయన ప్రతిష్ఠ ఏమయిందో చెప్పగలరా?" అని బాబా కాలదేవుణ్ణి అడిగాడు.

"దాన్ని ఆయన ఇరుగుపొరుగు ఇళ్ళ వాళ్ళందరూ కలిసి ముక్కలుముక్కలు చేసి తలా ఒక ముక్క ఎత్తుకుపోయి భద్రంగా దాచుకున్నారు. వృద్ధుణ్ణి వాటిని తిరిగి తెచ్చుకుని అతుకోమను!" అన్నాడు కాలదేవుడు.




"ఇంకొక అజానుబాహువు తన ఓర్పును పోగొట్టుకున్నాట్ట. అది ఎక్కడ పడి పోయిందో మీకు తెలుసా?" అని బాబా మళ్ళీ అడిగాడు.

"నువ్వూ అతనూ కలుసుకుని మాట్లాడిన చోటనే గడ్డిలో అతని ఓర్పు పడివున్నది. అది జామకాయ ప్రమాణంలో తెల్లగా ఉంటుంది. నువ్వు అక్కడ వెతికితే అది దొరుకుతుంది," అన్నాడు కాలదేవుడు.

"తరవాత జీజీరాజుగారి కూతురు చిన్నతనంలోనే తప్పిపోయిందిట. ఆ పిల్ల జాడకూడా చెప్పి పుణ్యం కట్టుకోండి," అన్నాడు బాబా.



"పిచ్చివాడా, నువా పిల్లను బాగా ఎరుగుదువు. దీదీ అనే పేరుతో ఆమె మీ రాజుగారి దగ్గిర పని చేస్తున్నది," అన్నాడు కాలదేవుడు. బాబా కాలదేవుడికి ప్రణామం చేసి తిరుగు ప్రయాణానికి సిద్ధమయాడు. సరిగా ఆ సమయానికే మధ్యాన్నపు ఘడియా, విఘడియలూ బయలుదేరుతున్నారు. వారు అతణ్ణి వెంట తీసుకుని మధ్యదారిలో దింపేశారు. అజానుబాహువును కలుసుకుని మాట్లాడిన చోటనే బాబా దిగిపోయాడు.

ఆ సమీపంలో ఉన్న గడ్డిలో వెతకగా అతనికి, కాలదేవుడు చెప్పినట్టే, జామకాయ ప్రమాణంలో ఓర్పు దొరికింది కాని ఆ అజానుబాహుడి జాడమాత్రం లేదు. అక్కడి నుండి బాబా జీజీనగరం వెళ్లి అక్కడి రాజుతో, "మీ కుమార్తె జాడ తెలుసు కున్నాను. మీరు కొంత పరివారం తీసుకుని నావెంట రండి!" అన్నాడు.

జీజీరాజు పరమానందంతో రథాలు అయత్తం చేయించి, బాబాను ఒక రథంలో ఎక్కించి, తానుకూడా అందులో ఎక్కి, పరివారంతో సహా బయలుదేరాడు.

అందరూ కలిసి బాబా ఉండే నగరం చేరేసరికి నగరమంతా చిన్నబోయినట్టున్నది. జనం గుంపులుగుంపులుగా చేరి రహస్యంగా మాట్లాడుకుంటున్నారు.



బాబా నేరుగా రాజభవనానికి వెళ్లి రాజుతో, "మహారాజా, ఎక్కడ చూసినా జనం విచారంగా ఉన్నారు. ఏం జరిగింది?" అని అడిగాడు.

రాజు నిట్టూర్చి, "ఏం చెప్పేది? నిన్న ఈ నగరానికి ఒక రాక్షసుడు వచ్చి, తనకు వంట చెయ్యటానికి మంచి వంటగత్తెను ఇవ్వమని అడిగాడు. రాక్షసుడికి వంట చెయ్యటానికి ఎవరు ఒప్పుకుంటారూ? ఎవరూ ఒప్పుకోలేదు. రాక్షసుడికి కోపం వచ్చి, ఇవాళ సూర్యాస్తమయంలోగా తనకు వంటగత్తెను పంపకపోతే రేపు తెల్లారేలోపుగా నగరాన్ని మట్టుపెట్టేస్తానన్నాడు. ఈ సంగతి తెలిసి దీదీ, నగరాన్ని రక్షించేటందుకుగాను తాను రాక్షసుడి నౌకరీ చేస్తానని ఒప్పుకున్నది. ఇదుగో, ఇంతకు ముందే సరిగా సూర్యాస్తమయం కాబోతూండగా ఆమె బయలుదేరి వెళ్లిపోయింది!" అన్నాడు రాజు విచారంగా.

బాబా చివాల్న లేచి నిలబడ్డాడు. అతను పడమటి ఆకాశంకేసి చూసి, "సూర్యాస్తమానమై ఇంకా ఘడియ కాలేదు. ఈ ఘడియను వెనక్కు తిప్పి దీదీ ఇక్కడే ఉండేట్టు చేస్తాం!" అంటూ చప్పున డబ్బీ పైకి తీసి మూత తెరిచాడు. మరుక్షణం కళ్లు మిరుమిట్లు గొలిపే కాంతి ఒకటి మెరిసింది.



ఆ తరవాత కాలం ఒక ఘడియ వెనక్కు జరిగింది. పడమటివైపున సూర్యుడు అస్తమించ బోతున్నాడు. దీదీ రాక్షసుడి వద్దకు బయలుదేర బోతున్నది. బాబా పరుగెత్తుకు వెళ్లి ఆమె చెయి పట్టుకుని, "దీదీ, నువు రాక్షసుడి వద్దకు వెళ్ల నవసరంలేదు. ఇరుగో మీ నాన్నగారు! జీజీదేశపు రాజుగారు!" అంటూ ఆమెకు రాజును చూపించాడు.

జీజీరాజు తన కుమార్తెను కౌగలించుకుని ఆనంద బాష్పాలు రాల్చాడు. అందరూ దీదీని గురించి తెలుసుకోవటంలో నిమగ్నులై ఉండగా చీకటి పడింది.

తనకు వంటగత్తెను పంపలేదని రాక్షసుడు అలిగి, ఉగ్రుడై, పెడబొబ్బలు పెట్టుకుంటూ వచ్చాడు.

"వాడి సంగతి నేను చూస్తాను. మీరేమీ భయపడకండి," అంటూ బాబా వాడిమీదికి కత్తిదూసి వెళ్ళాడు. రాక్షసుడు నోరు తెరిచి, చేతులు చాచి, బాబాను పట్టుకోవటానికి వచ్చాడు. వాణ్ణి దగ్గరదాకా రానిచ్చి, బాబా తనవద్ద ఉన్న ఓర్పును, తెరిచిఉన్న వాడి నోట్లోకి విసిరాడు.

వెంటనే రాక్షసుడిలో పెద్ద మార్పు వచ్చింది: వాడు ఆ ఓర్పును మింగి, బాబాను చూసి ఒక పిచ్చినవ్వు నవ్వి, "కోప్పడకండి! వస్తాను! శలవు! నమస్కారం," అని ఒక దణ్ణంపెట్టి, తల వంచుకుని వచ్చిన దారినే వెళ్లిపోయాడు.

తరవాత జీజీరాజుగారు బాబాతో, "నాయనా, నాకు మగపిల్లలు లేరు. నా కూతుర్ని నాకు వప్పగించావు. నీ ఋణం ఎలాగూ తీర్చుకోలేను, మాదేశం వచ్చి, మా అమ్మాయిని పెళ్లాడి, నా తదనంతరం రాజ్యం చేతువుగాని, రా!" అన్నాడు. బాబా సంతోషంగా ఒప్పుకున్నాడు.

అతనికీ దీదీకి మహావైభవంగా పెళ్లి జరిగింది. బాబా జీజీనగరం వెళ్లి, మామ గారి అనంతరం దానికి రాజయ్యాడు.





# నమ్ముదగిన కల

పూర్వం ఇంద్రప్రస్థనగరంలో ఒక గొప్ప ధనికుడుండేవాడు. కొంతకాలం సుఖాలలో మునిగి తేలినాక ఆయనకు రోజులు కలిసి రాక, వున్న ఆస్తి యావత్తూ పోయింది. ఒకప్పుడు గొప్పగా బతికినవాడు కాస్తా ఇప్పుడు పూర్తిగా బీదవాడైపోయాడు.

ఈ స్థితిలో ఉండగా ఆయనకు ఒకరాత్రి నిద్రలో ఒక కల వచ్చింది. ఆ కలలో ఆయనకు శ్రీమహావిష్ణువు కనిపించి, "నువు వెంటనే బయలుదేరి పాటలీపుత్రనగరానికి వెళ్ళు. అక్కడ నీకు డబ్బు దొరుకుతుంది. దానితో నువు తిరిగి ధనికుడవై సుఖపడగలవు!" అని చెప్పాడు.

కలలో శ్రీమహావిష్ణువు చెప్పిన మాటలలో గురి కుదిరి ఆ నిర్భాగ్యుడు ఒంటరిగా కాలినడకను ప్రయాణంచేసి చాలారోజులకు పాటలీపుత్రనగరం చేరుకున్నాడు. అసలే ఆయనకు ఆ నగరం కొత్త. దానికి తోడుగా ఆయన నగరంలోకి ప్రవేశించేసరికి బాగా చీకటి పడింది. అమావాస్య రోజులు కావటంచేత ఆకాశాన చంద్రుడుకూడా లేడు.

అందుచేత ఆయన ఎలాగో ఒక గుడి చేరుకుని ఆ గుడి మంటపంలో పడుకుని కొద్దిసేపట్లో నిద్రపోయాడు. నగరమంతా మాటుమణిగిన కొంతసేపటికి ఆ గుడిని ఆనుకునివున్న ఒక ఇంట దొంగలు ప్రవేశించారు. ఆ ఇంటి యజమాని దొంగల అలికిడి విని నిద్ర లేచి, "దొంగలు! దొంగలు!" అని గొంతెత్తి అరిచాడు. క్షణంలో చుట్టుపక్కలవారంతా వచ్చారు.

దొంగల ఆట కట్టయింది. వారు గోడ మీదినుంచి గుడి ఆవరణలోకి దూకి మంటపం పక్కగా పరుగుతీసి చీకటిలో అంతర్ధానమైనారు. వారిని తరుముకుంటూ వచ్చిన జనం గుడి ఆవరణ అంతా వెతికి, చివరకు మంటపంలో నిద్రపోతున్న పర

డి. సుసీలకుమారి



దేశిని పట్టుకుని చేతులుకట్టి తలారివద్దకు లాక్కుపోయారు.

దూరప్రయాణం చేసి మట్టికొట్టుకుని వున్న ఆ పెద్దమనిషి తలారికి దొంగలాగే కనిపించాడు. ఆయన ఆ పరదేశిని తన భటులచేత బాగా తన్నించి, "నిజం చెప్పు! ఎవరు నీవు? ఎందుకు దొంగతనానికి వచ్చావు?" అని అడిగాడు.

"అయ్యా, నేను దొంగనుగాను. మాది ఇంద్రప్రస్థం. నేను ఒకప్పుడు బాగా బతికిన వాణ్ణి. భగవంతుడు రెండుసార్లు నన్ను మోసగించాడు. మొదట నాకున్న ధన మంతా పోగొట్టాడు. అంతటితో తృప్తితీరక, శ్రీమన్నారాయణమూర్తి రూపంలో కలలో కనిపించి నన్నీ పాటలీపుత్రానికి వెళ్లమనీ, ఇక్కడ నాకు ధనం దొరుకుతుందనీ చెప్పాడు. ఆ మాటలు నమ్మి ఎంతో శ్రమ పడి ఇంద్రప్రస్థంనుంచి ఇక్కడిదాకా నడిచి వచ్చి ఈ రాత్రే చేరాను. వచ్చి నాలుగు ఘడియలైనా కాకముందే తమచేత తన్నులు తిన్నాను!" అన్నాడు పరదేశి.

ఈ మాటలు విని తలారి నవ్వి, "ఓయి, పిచ్చివాడా! ఎవరైనా కలలను నమ్ముతారా? కొద్దికాలంకిందట నాకుకూడా కలలో శ్రీమన్నారాయణమూర్తే కనిపించి, మీ ఇంద్రప్రస్థంలోనే ఫలాని ఇంటివెనక ఫలాని చెట్టుకింద తవ్వితే గొప్ప నిధి దొరుకుతుందన్నాడు. నేనామాటలు నమ్మి ఇంద్రప్రస్థం వెళ్లలేదే! కనక నువు ఇలాటి పిచ్చినమ్మకాలు మాని హాయిగా ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్లు!" అని సలహా ఇచ్చాడు.

డబ్బు పోగొట్టుకున్న ధనికుడు వెంటనే బయలుదేరి ఇంద్రప్రస్థానికి వెళ్లాడు. ఆయన తలారి చెప్పిన గుర్తులనుబట్టి ఒక చెట్టుకింద తవ్వి చూడగా నిజంగానే పెద్దనిధి దొరికింది. దానితో ఆయన తిరిగి ధనవంతుడై సుఖంగా ఉన్నాడు. ఈ విధంగా ఆయనకు వచ్చిన కల నిజమయింది.



# దీపావళి సంఘటన

దీపావళికి అక్కా బావా వచ్చారు.

బాణాసంచా కొనిపెడతానని బావ రాజాను బజారుకు తీసుకుని బయలు దేరాడు. "వచ్చేటప్పుడు నాకు మంచిపూలు పట్టుకురండి!" అని చెప్పింది అక్క బావతో.

బావదగ్గిర వున్న డబ్బంతా అయిపోయినదాకా రాజా బాణాసంచా కొనిపించాడు. వాటిని సంచీలో వేసుకుని వస్తుండగా పూలమ్మే మనిషి కనిపించింది.

బావ జేబులు తడువుకున్నాడు. జేబులన్నీ ఖాళీ.

"బాణాసంచా తీసుకుని పూలిస్తావా, అమ్మీ?" అన్నాడు బావ. పూలమ్మే మనిషి సరేనన్నది.

"సంచీలో బాణాసంచా ఆ మనిషికి యిచ్చెయ్యరా, రాజా. మళ్ళీ వచ్చి బాణాసంచా కొందాంలే!" అన్నాడు బావ. రాజాముఖం చిన్నబోయింది.

బాణాసంచా ఇచ్చేసి పూలు తీసుకుని ఇద్దరూ బయలుదేరారు. కొంత దూరం వెళ్ళాక రాజా, "బావా, నా రుమాలు పడిపోయింది. అది తీసుకువస్తాను. నువు నడుస్తూవుండు!" అంటూ పూలసంచీ పట్టుకుని వెనక్కు పరిగెత్తాడు.

పూలమ్మే మనిషి కనిపించింది. "అమ్మీ, నీ పూలు నువు తీసుకుని మా బాణాసంచా ఇచ్చెయ్యి. పేచీపెట్టావంటే పోలీసును పిలుస్తాను!" అన్నాడు రాజా.

పూలమనిషి బాణాసంచా ఇచ్చేసి పూలు తీసుకున్నది.

ఇంటికి వచ్చిన భర్తతో అక్క, "పూలు తెచ్చారా?" అని అడిగింది.

"రాజా తెస్తున్నాడు!" అన్నాడు బావ.

కాని తీరా రాజా వచ్చేసరికి సంచీలో చూస్తే బాణాసంచా తప్ప పూలు లేవు. అక్క అగ్గయిపోయింది. బావముఖం చూసితీరాలి!

(పక్క పేజీ చూడండి)




# 3

[మొరాకోదేశంనుంచి చీనాకు వచ్చిన మాంత్రికుడు అలాదీన్ తల్లితో పరిచయం చేసుకుని, తాను అలాదీన్ పినతండ్రినని ఆమెను నమ్మించి, అలాదీన్‌ను గొప్పవాణ్ణి చేస్తానని మాట ఇచ్చి, నగరానికి దూరంగా తీసుకువెళ్లి అలాదీన్‌ను ఒక భూగర్భంలోని గుహలోకి పంపాడు. అలాదీన్ ఆ గుహనుంచి తెచ్చిన దీపాన్ని తన కివ్వనందున మాంత్రికుడు అలిగి, అతణ్ణి ఆ గుహలోనే వుంచి భూస్థాపన చేశాడు.]

ఈ మాంత్రికుడు వాస్తవంగా మొరాకో దేశస్థుడే. అతనికి అనేక రకాల మంత్ర తంత్రాలు తెలుసును. అతను చిన్నపిల్ల వాడుగా ఉన్నప్పుడే ఉచ్చాటనలూ, ప్రయోగాలూ, ఉపాసనలూ ప్రారంభించి, నలభై ఏళ్ళు వచ్చేసరికి సాటిలేని శక్తులు సంపాదించాడు. ఈ శక్తులతోబాటు అతనికి రహస్యజ్ఞానంకూడా లభించింది. అందుచేత అతను ఒక వింతవిషయం తెలుసుకున్నాడు.

ఎక్కడో దూరాన ఉన్న చీనాదేశంలో ఒక నగరం వున్నది. ఆ నగరం సమీపాన భూగర్భంలో ప్రపంచంలో ఎక్కడా లేనంత గొప్ప నిధి వున్నది. ఆ నిధితోబాటు ఒక అద్భుతదీపంకూడా ఉన్నది. ఆ దీపాన్ని సంపాదించినవాడు ఏది కావాలంటే అది సాధించవచ్చు; కాని అలాదీన్ అనే ఒక పేద కుర్రవాడికి మాత్రమే ఆ లాంతరును బయటికి తెచ్చే శక్తి వున్నది.

బి. ప్రసాదరావు

ఈ విషయాలన్నిటినీ మాంత్రికుడు మొరాకోలో వుండే గ్రహించాడు. తాను తెలుసుకున్న ఈ విషయాలను పూర్తిగా నమ్మి ఆ మాంత్రికుడు బయలుదేరి చీనాకు వచ్చాడు. ఈ ప్రయాణం అతనికి చాలా ప్రయాస కలిగించింది. కాని అతనికి అలాదీన్ దొరికాడు. అంతా సవ్యంగానే జరిగింది. కాని ఆఖరుక్షణంలో అలాదీన్ మాంత్రికుడికి దీపం అందించ నిరాకరించాడు. దానితో అతడికి కోపంవచ్చి అలాదీన్‌ను గుహలో బంధించి తాను మొరాకోకు వెళ్ళిపోయాడు.

తన నెత్తిపైన వున్న బిలం ఎప్పుడైతే మూసుకుపోయిందో అలాదీన్ కంగారుపడి కేకలుపెట్టసాగాడు. "చిన్నాయినా, నన్ను పైకి లాగు!" అని ఏడిచాడు. కాని అతని మొర ఆలకించేవారు లేరు. ఆయన తన చిన్నాయిన కాడనీ, తాను మోసపోయాననీ అలాదీన్ గ్రహించాడు. ఈ గుహలో తనకు చావు తప్పదని నిశ్చయించుకుని అతను మెట్లు దిగి తోటలోకి పోవటానికి ప్రయత్నించాడు. కాని మెట్లఅడుగున వున్న వాకిలి ఇప్పుడు మూసుకుని ఉన్నది. అందుచేత అతను మెట్లమీద చేరగిలబడ్డాడు.

అలాదీన్ మూడురోజులపాటు అక్కడే ఉన్నాడు. అతనికి ఈ మూడురోజులపాటూ తిండీ నీరూ లేవు. అంతసేపూ అతను



ఏడుస్తూ, మధ్యమధ్య అల్లాను ప్రార్థిస్తూ గడిపాడు. చచ్చిపోవటం తప్పదన్న నిరాశతో అతను చేతులు నలుపుకుంటూ ఏడవ సాగాడు. అలా చేతులు నలుపుకోవటంలో అతను తన వేలిన వున్న ఉంగరాన్ని రుద్దు కున్నాడు. ఆ ఉంగరం అలాదీన్‌కు మాంత్రికుడిచ్చినదే.

ఆ ఉంగరాన్ని అలాదీన్ రుద్దగానే ఒక నల్లటి, ఎత్తయిన భూతం అతనిఎదట ప్రత్యక్షమై, "ఏం సెలవు, దొరా?" అని అడిగింది.

అలాదీన్ గుండె అవిసిపోయింది. కాని మాంత్రికుడి ప్రభావం కళ్లారా చూసి ఉన్నాడు గనక, ధైర్యం తెచ్చుకుని, "ఎవరు నువు?" అని అడిగాడు.

"నేను ఉంగరాన్ని ఆశ్రయించిన భూతాన్ని. ఆ ఉంగరం ఎవరి చేతికి వుంటే వారికి బానిసగా ఉండి, చెప్పిన పని చేస్తాను," అన్నది భూతం.

"అయితే నన్ను ఇక్కడినుంచి తీసుకుపోయి భూమిమీద పెట్టు," అన్నాడు అలాదీన్.

మరుక్షణం భూమి పెళపెళా పగిలిన చప్పుడయింది. అలాదీన్ భూమిమీద ఉన్నాడు. మూడురోజులపాటు చీకటిలో ఉన్న కారణంచేత అతని కళ్లు సూర్య






కాంతిని భరించలేకపోయాయి. అతను చివరకు కళ్లుతెరచి చూసేసరికి తాను భూమిపైన ఉన్నట్టు స్పష్టమయింది. గుహ జాడగాని, చలపరాతిపలక జాడగాని లేదు. మాంత్రికుడు చితుకులతో మంట చేసినచోట బూడిదమాత్రం ఉన్నది. దూరాన తోటలూ, వాటిఅవతల నగరమూ కనిపించాయి. అలాదీన్ పెద్దనిట్టూర్పు విడిచి, అల్లాకు ధన్యవాదాలు చెప్పుకుని ఇంటికి బయలుదేరాడు.

తాను అంతదూరం ఎలా నడిచాడో అతనికే తెలియదు; ఇంటో అడుగు పెడుతూనే అతని తల్లిఎదట శోషతో పడిపోయాడు. అలాదీన్ తల్లి ఇన్నిరోజులూ అతనికోసం ఏడుస్తూ కూచునివున్నది. ఇప్పుడామె అతని మొహాన చన్నీరు చల్లి, స్పృహ తెప్పించి, తినటానికింత తిండి పెట్టింది. అలాదీన్‌కు మళ్లీ కొంతబలం వచ్చింది. "చూడమ్మా, నా చిన్నాయిన అంటూ వచ్చినవాడు ఎవడో మాంత్రికుడు—నిజంగా చిన్నాయిన కాదు. వాడు చాలా క్రూరాత్ముడు, నన్ను చంపెయ్యటానికి ప్రయత్నం చేశాడు. వాడి మాటలు నమ్మి మనం మోసపోయాం! వాడేంచేశాడో తెలుసా, అమ్మా?" అంటూ అలాదీన్ జరిగినదంతా తల్లికి చెప్పాడు.

ఆమె తల అడ్డంగా తిప్పి, "వాడు దొంగవాడని నేను అప్పుడే అనుకున్నా రా, నాయనా. ఇంకా నయం, భగవంతుడి దయవల్ల నువు ప్రాణం దక్కి బయటపడ్డావు!" అన్నది. ఆమె ఈవిధంగా మాట్లాడుతూండగానే, మూడు రోజులు నిద్రాహారాలు లేని అలాదీన్, మైకంలో పడిపోతున్నవాడిలాగా అయిపోయి, మర్నాడు మధ్యాన్నందాకా గాఢనిద్ర పోయాడు.

అతను తిరిగి లేస్తూనే, "అమ్మా, ఆకలిగా ఉంది, అన్నం పెట్టు!" అన్నాడు.

"అయ్యో, తండ్రీ! ఇంట్లో తినటానికేమీ లేదురా! ఉన్నదంతా నిన్న నీకే పెట్టాను. ఆకలికి కొంచెం ఓర్చుకుంటివా, నేను వడి

కిన నూలున్నది, దాన్ని అమ్మి నీకేదైనా తిన టానికి పట్టుకొస్తాను!" అన్నది తల్లి.

"నూలు అమ్మితే ఏం వస్తుందమ్మా? నేను తెచ్చిన దీపం పట్టుకురా. దాన్ని అమ్మేసి వచ్చినంత డబ్బు తెస్తాను!" అన్నాడు అలాదీన్.

అతని తల్లి దీపాన్ని తెచ్చి, "ఇది మురికిగా ఉంది, నాయనా. శుభ్రంగా తోమి తళతళ లాడేట్టు చేస్తే, రెండు డబ్బులు ఎక్కువ రావచ్చు," అన్నది.

ఆవిడ ఇంత తడిఇసక తెచ్చి దీపాన్ని తోమ నారంభించింది. ఆవిడ దీపాన్ని రెండు సార్లు రుద్దిందో లేదో, ఆమె ఎదట పెద్ద తాటి చెట్టంత భూతం నిలబడి, "ఏం సెలవు, దొరసానీ? నేనూ ఇంకా ఇతర భూతాలు ఈ దీపంవెంట వుండి, ఈ దీపం ఎవరి చేతిలో ఉంటే వారికి సేవచేస్తాం!" అన్నది.

ఆ భూతాన్ని చూడగానే అలాదీన్ తల్లి కొయ్యబారి పోయింది. భయంతో ఆమె నోట ఏమాటా రాలేదు. మరుక్షణంలో ఆమె స్పృహ తప్పి పడిపోయింది.

ఇంటిలో ఉన్న అలాదీన్‌కు భూతం మాటలు వినిపించాయి. ఉంగరం భూతంతో అతను అదివరకు మాట్లాడిఉన్న కారణం చేత అతను బయటికి పరిగెత్తుకు వచ్చి




జరిగినది చూశాడు. తన తల్లి చేతిలోనుంచి దీపాన్ని లాక్కుని, "ఏయ్, నాకు ఆకలిగా ఉంది. తినటానికి మంచి భోజనం పట్టుకు రా!" అని భూతాన్ని ఆజ్ఞాపించాడు.

భూతం మాయమై అంతలోనే తిరిగి వచ్చి ఒక విశాలమైన వెండిపళ్లెం కింద ఉంచింది. దానినిండా రకరకాల ఆహారాలూ, పానీయాలూ ఉన్నాయి. భూతం తిరిగి అదృశ్యమైపోయాక అలాదీన్ తన తల్లికి శైత్యోపచారాలు చేసి మూర్ఛ తెలిసే టట్టు చేశాడు.

ఆవిడ కళ్లుతెరచి వెండిపళ్లెంలో ఉన్న ఆహారాలు చూసి, "ఇవన్నీ ఎక్కడివిరా,

నాయనా? రాజుగారు మనం పడే బాధలు తెలుసుకుని భోజనం పంపించారా ఏమిటి?" అన్నది ఆశ్చర్యంగా.

"ఆ విషయాలన్నీ తరవాత తెలుసుకో వచ్చులే, ముందు ఆకలి తీర్చుకుందాం, అమ్మా!" అన్నాడు అలాదీన్.

పాపం, ఆ పేదరాలు అటువంటి భోజనం ఎన్నడూ చేసివుండలేదు. అది చక్రవర్తులు చేసే భోజనం. ఆ వెండిపళ్లెం విలవకూడా ఆ తల్లికొడుకు లెరగరు. ఎందుకంటే వారెన్నరూ వెండివస్తువులు కొన్నవారుకారు.

వారిద్దరూ కడుపునిండా తినగా ఇంకా రెండు పూటలకు సరిపడే భోజనపదార్థాలు మిగిలిపోయాయి. చివరకావిడ తన కొడుకుతో, "నాయనా, నువు ఇక ఆకలిగా ఉంది అనవు. అదే నాకు పదివేలు. అన్నట్టు ఆ భూతం ఏమయిందిరా?" అన్నది.

తాను మూర్ఛపోయాక జరిగిన సంగతులన్నీ ఆమె కొడుకునుంచి తెలుసుకుని, "అయితే మనుషులకు భూతాలు నిజంగా కనిపిస్తాయన్నమాటే! నేనెన్నడూ ఒక్క భూతాన్నికూడా చూసి ఎరగను. నిన్ను ఆ గుహలోనుంచి బయటికి తెచ్చిన భూత మిదే కాబోలు!" అన్నది.

"కాదమ్మా, నన్ను గుహలోనుంచి బయటపడేసిన భూతం ఉంగరానిది. ఇది



దీపం భూతం. రెండిటి ఆకారంలోనూ చాలాతేడా ఉంది," అన్నాడు అలాదీన్.

"మన కొంపమీదికి ఈ భూతాలన్నీ ఏమిటి, నాయనా? ఆ ఉంగరాన్నీ, దీపాన్నీ ఎక్కడన్నా పారేసిరా, నీకు పుణ్యం వుంటుంది!" అన్నది అలాదీన్ తల్లి ఎంతో భయంతో.

"అవి మనకు ఉపకారం చేస్తున్నాయి గదా?" అన్నాడు అలాదీన్.

"అసలు మనం ఆ భూతాలతో ప్రమేయం పెట్టుకోవటమే తప్పు. అదీ కాక, వాటిని చూసి నేను దడుచుకు చస్తాను. అవి మనకు వద్దు, నాయనా!" అన్నది తల్లి.

"అమ్మా, నువు కొంచెం ఆలోచించు. మనకు మళ్లీ ఆకలి అవుతుంది. అప్పుడు ఏం తింటాం? ఆ మాంత్రికుడు మొరాకో నుంచి ఇంత దూరం ప్రయాసపడి వచ్చింది దేనికో తెలుసా? ఈ దీపంకోసం! ఆ గుహలో అంతులేని బంగారం వుంది; కాని వాడు దానికోసం అడగలేదు. నేను తనకు దీపం ఇచ్చాను కానని నన్ను గుహలో మూసిపెట్టి వెళ్ళిపోయాడు. ఈ దీపం అటువంటి ప్రభావం కలది. అది మనవద్ద ఉన్నంత కాలమూ మనకేలోటూ వుండదు. దాన్ని మనం ప్రాణంకన్న ఎక్కువగా కాపాడు కోవాలి. అది మనవద్ద ఉన్నట్టు పురుగు





కైనా తెలియనివ్వరాదు. ఇక ఈ ఉంగరం మాటా? అది నన్ను ఒకసారి చావునుంచి కాపాడింది. రేపు నాకింకో ఆపద రావచ్చు. అప్పుడు నన్నది కాపాడుతుంది. దాన్ని ఎలా పారెయ్యను? అది నాచేతిన వుండ వలిసిందే. దీపాన్ని చూసి నువు దడుచు కుంటావన్నట్టయితే దాన్ని నీకంట పడ కుండా ఎక్కడైనా దాస్తాలే!" అన్నాడు అలాదీన్.

"ఇక నీయిష్టం, నాయనా, నేనెందుకు కాదనాలి? కాని నేనుమాత్రం ఇక ఆ భూతాలను నా కళ్ళతో చూడను, వాటిఊసే నాకక్కర్లేదు!" అన్నది తల్లి.

భూతం తెచ్చియిచ్చిన ఆహారం మర్నాటి కల్లా అయిపోయింది. పెద్ద వెండిపళ్ళెమూ, అందులో వుండిన పన్నెండు చిన్నకంచాలూ మిగిలాయి. అలాదీన్ ఒక చిన్న కంచం పట్టుకుని బజారుకు వెళ్లి, దాన్ని ఒక వడ్డీ వ్యాపారికి చూపాడు. వ్యాపారి అలాదీన్ కేసి చూసి, "దీన్ని ఎంతకు అమ్ముతావు?" అని అడిగాడు.

"దానిధర ఎంతో నీకు తెలియదా?" అన్నాడు అలాదీన్ గడుసుగా.

వడ్డీవ్యాపారి తికమకలో పడ్డాడు. ఆ కంచం ఖరీదు అలాదీన్‌కు తెలుసునో, తెలియదో? తక్కువఇస్తే అలాదీన్ తిడతాడేమో, ఎక్కువఇస్తే తనకు అనవసరంగా నష్టం జరుగుతుందేమో? ఈ విధంగా ఆలోచిస్తూ ఆయన తన జేబులోనుంచి ఒక బంగారు నాణెం పైకితీశాడు. అలాదీన్ ఆశగా చెయ్యి చాచి, ఆ నాణెం తీసుకుని ఇంటికి పరిగెత్తాడు. ఆ కంచం విలవ అతనికి తెలియదనీ, ఇంకా తక్కువ ఇచ్చినా అతను తీసుకునే వాడేననీ గ్రహించి వడ్డీవ్యాపారి చాలా చింతించాడు.

అలాదీన్ తాను తెచ్చిన బంగారునాణెం తల్లికిచ్చాడు. ఆమె బజారుకు వెళ్ళి కావలసిన సరుకులు తెచ్చింది. ఆ డబ్బు

ఖర్చయిపోగానే అలాదీన్ ఇంకొక చిన్న కంచం పట్టుకుపోయి వడ్డీవ్యాపారికి అమ్మాడు. లోగడ ఒక బంగారునాణెం ఇచ్చివున్నాడు గనక వ్యాపారి ఈసారికూడా అంతే ఇవ్వవలసివచ్చింది.

ఇలా పన్నెండు కంచాలూ అమ్మి ఆ డబ్బు ఖర్చుచేసినాక వెండిపళ్లెం మిగిలింది. అది చాలా బరువు. అందుచేత అలాదీన్ వడ్డీవ్యాపారిని ఇంటికి పిలిపించాడు. ఆ వ్యాపారి అలాదీన్ చేతిలో పది బంగారు నాణాలు పెట్టి పళ్ళాన్ని పట్టుకెళ్ళాడు.

ఆ డబ్బుకూడా అయిపోయింది. అలాదీన్ తన తల్లిని ఎక్కడికో పంపేసి, దీపాన్ని బయటికి తీసి రుద్దాడు. భూతం ప్రత్యక్షమయింది. "ఆకలిగా వుంది. వెనక తెచ్చినట్టే భోజనం పట్టుకురా!" అన్నాడతను, భూతంతో. భూతం మరొకసారి పెద్ద వెండి పళ్ళెంలో పన్నెండు కంచాలనిండా ఆహారం పేర్చుకుని తెచ్చియిచ్చి, మాయమయింది.

కొంచెంసేపటికి అలాదీన్ తల్లి తిరిగి వచ్చింది. ఆహారం చూసి ఎంతో సంతోషించి, "ఆ భూతం కడుపు చల్లగా భోజనం వచ్చిందా? దాన్ని మాత్రం నాకళ్ళ చూడను!" అన్నది. ఆ తరవాత తల్లి కొడుకులు ఏ చింతా లేకుండా రెండురోజులపాటు



సుఖంగా భోజనం చేశారు. తరవాత అలాదీన్ వెండికంచం ఒకటి పట్టుకుని బజారుకు బయలుదేరాడు.

దారిలో ఒక కమసాలి దుకాణం వున్నది. ఈ కమసాలి చాలా న్యాయస్తుడు, ధర్మబుద్ధి కలవాడు. ఆయన అలాదీన్‌ను చూసి, "నేను అప్పుడప్పుడూ చూస్తున్నాను, ఏమిటో పట్టుకుపోయి వడ్డీవ్యాపారికి అమ్ముతున్నట్టున్నావే? వాళ్ళు కర్కోటకులు, నాయనా? నాకు అమ్మరాదా? నేను నిన్ను మోసం చేస్తానా?" అన్నాడు.

అలాదీన్ చంకలోనుంచి కంచంతీసి కమసాలికి చూపాడు. కమసాలి దాన్ని





చెయ్యకుండా, అతనూ అతని తల్లీకూడా నిరాడంబర జీవితం గడపసాగారు.

ఇప్పుడు అలాదీన్ పూర్తిగా మారి పోయాడు. అతనిలో సోమరిలక్షణా లేమీ లేవు. అతను రోజూ బజారుకు వెళ్ళి పెద్ద పెద్ద వ్యాపారస్తులతో మాట్లాడేవాడు; క్రయ విక్రయాలు గమనించేవాడు; రత్నవర్తకులు చేసే అమ్మకాలు పరిశీలించేవాడు.

అతనికి ఒక అద్భుతమైన విషయం తెలియవచ్చింది; మాంత్రికుడు తనను గుహలోకి పంపినప్పుడు, అక్కడి తోటనుంచి తాను కోసుకువచ్చిన పళ్లు రంగు గాజు పెంకులు కావు—వెలలేని రత్నాలు! తన వద్ద వున్న రత్నాలు చక్రవర్తులవద్దకూడా వుండవు! రత్నవర్తకులవద్ద వున్న మణులలోకెల్లా విలవైనవాటిని అలాదీన్ చూశాడు. కాని అవేవీ అతనివద్ద ఉన్నవాటికి ఏమాత్రమూ చాలవు.

అతను ఈ సంగతి గ్రహించిన కొద్ది రోజులకే ఒక చిత్రం జరిగింది. ఆ ఉదయం అతను నగలవర్తకుల బజారుకు పోతూండగా రాజభటులు వచ్చి దుకాణా లన్నీ మూయించసాగారు. ఆ దారిగా రాజ కుమార్తె స్నానశాలకు వెళుతున్నది. వీధు లలో దుకాణాలన్నీ మూసి, జనం ఇళ్లలోకి

త్రాసులో తూచి, "దీని ఖరీదు డెబ్భై బంగారు నాణాలు. నీకా వడ్డీవ్యాపారి లోగడ ఏమిచ్చాడు?" అన్నాడు.

"ఒక్కనాణెం ఇచ్చాడు దుర్మార్గుడు!" అని చెప్పి, అలాదీన్ ఆ కంచాన్ని కమ సాలికి అమ్మి అతడు యిచ్చిన డబ్బు పుచ్చుకుని ఇంటికి వెళ్ళాడు.

అది మొదలు అలాదీన్ తన వెండి యావత్తూ కమసాలికే అమ్ముతూ వచ్చాడు. క్రమంగా అతనిదగ్గిర ధనం చేరసాగింది. కాని అలాదీన్ ఆర్భాటంగా జీవించాలని ప్రయత్నించలేదు. అవసరమైన వస్తువులు మాత్రమే కొంటూ, డబ్బు ఏమాత్రమూ వృథా



వెళ్లిపోయి, వీధులు ఖాళీ చెయ్యవలిసిందనీ, అలా చెయ్యనివారికి మరణదండన విధించ బడుతుందనీ రాజభటులు హెచ్చరికలు చేస్తూవచ్చారు.

ఈ హెచ్చరిక వినగానే అలాదీన్‌కు ఎలాగైనా రాజకుమార్తెను చూడాలన్న కుతూహలం కలిగింది. రాజకుమార్తె బుదూర్ చాలా గొప్ప అందగత్తె అని అందరూ అనుకోవటం అతను విని వున్నాడు.

ఆమెను చూడటానికి వీలుగా దాక్కోవాలని అతను చుట్టూ కలయజూశాడు. అతనికి అలాటి చోటేదీ కనిపించలేదు. స్నానశాల తలుపుల వెనక దాక్కుంటే బుదూర్ అక్కడికి చేరేటప్పుడు చూడటానికి సాధ్యపడుతుందని అతనికి తోచింది. వెంటనే అలాదీన్ స్నానశాలకేసి పరిగెత్తాడు. స్నానశాలద్వారం చాలా పెద్దది. దాని తలుపుల వెనక దాక్కుని అలాదీన్ రాజకుమార్తె రాకకోసం ఎదురుచూడసాగాడు.

ఈలోపుగా రాజకుమార్తె బుదూర్ రాజభవనంనుంచి బయలుదేరి, నగరం చూసుకుంటూ, నిర్మానుష్యంగా వున్న వీధుల వెంబడి స్నానశాలకు వచ్చింది. స్నానశాలలోకి అడుగుపెట్టబోతూ ఆమె తన ముఖానికి అడ్డంగా వున్న మేలిముసుగు పైకితీసింది.

అప్పుడు అలాదీన్ రాజకుమార్తెను చూశాడు. ఆమె ముఖం చంద్రబింబం కన్నకూడా అందంగా వున్నట్టు అతనికి తోచింది. "ఆహా, ఇటువంటి సౌందర్యాన్ని సృష్టించిన అల్లా మహిమ!" అనుకున్నాడు అలాదీన్.

ఆ క్షణంవరకూ అలాదీన్‌కు అందరు ఆడవాళ్లూ తన తల్లిలాగే కనబడేవారు. వారిలో ప్రత్యేకమైన అందం ఉంటుందని అతని కెన్నడూ తోచలేదు. కాని రాజకుమార్తె బుదూర్‌ను చూసిన క్షణం అతని హృదయం ప్రేమతో నిండిపోయింది.

(ఇంకా ఉంది)



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 జనవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బంతి కాదది

రెండవ ఫోటో : కుండల దొంతికాని.

పంపినవారు :

ఎం. జి. కాంతమ్మ, C/o. ఎం. సుబ్బయ్యగారు, ఎం.ఎ., ఎల్.టి., హెడ్మాస్టరు, ఆదోని.

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

భారత ప్రధాని నెహ్రూ, ఈ నెల 3 వ తేదీన బయల్దేరి, పదిరోజుల పర్యటనకై జపాను దేశం వెళ్లారు. అక్కడ ఆయనకు జరిగిన ఘనస్వాగతం ఇంతవరకు ఆ దేశంలో మరెవ్వరికీ జరగలేదని జపాన్ పత్రికలు వ్రాశాయి.

* * * *

బొంబాయిరాష్ట్రంలోని కాంబేతీరాన లోథాల్‌లో, ఇటీవల త్రవ్వకాలు జరపగా, గుండు సూది గుండంతలేని బంగారుపూసలు బయటపడ్డాయి. 5000 సంవత్సరాల కిందట అత్యంత నైపుణ్యంగల కార్మికులు అప్పట్లో వుండినట్లు దీనివల్ల రుజువగుతున్నది. ఈ త్రవ్వకాలలో అమూల్య వస్తువులు, ఏనుగుదంతం మొదలైనవికూడా దొరికినట్లు పురాతత్వ శాఖవారు చెబుతున్నారు.

* * * *

అనంతపురంజిల్లాలో 102 లక్షల రూపాయలతో నిర్మిస్తున్న భైరవానితిప్ప ప్రాజెక్టు పూర్తి కావచ్చింది. వచ్చే ఏడాది జూన్‌నుంచి ఈ ప్రాజెక్టు కాల్వలకు మొదటి పరిపంటకు నీరు వదలబడుతుంది.

* * * *

అక్టోబరు 1-వ తేదీ ఉదయాన, మద్రాసు గవర్నరు శ్రీ ఎ. జె. జాన్, అకస్మాత్తుగా ఆసుపత్రిలో కాలధర్మంచెందారు. ప్రముఖులు, ఎంతోమంది వచ్చి సానుభూతి తెల్పారు.



అక్టోబరు 4-వ తేదీన భూమిచుట్టూ చంద్రునిలాగ ప్రదక్షిణంచేసే ఒక కృత్రిమ ఉపగ్రహాన్ని సోవియట్ రష్యా అంతరిక్షంలోకి పంపించింది. అది 560 మైళ్ళ ఎత్తున గంటకు 17,000 మైళ్ల వేగంతో తిరుగుతున్నదనీ, ఈ కృత్రిమ చంద్రుని బైనాక్యులర్స్‌తో చూడవచ్చుననీ మాస్కో రేడియో ప్రకటించింది. ఉపగ్రహం వ్యాసం సుమారు 23 అంగుళాలు. బరువు 180 పౌనులు. ప్రపంచమంతటా అన్నిదేశాలవారూ ఈనాడు ఈ బాలచంద్రుణ్ణి స్పష్టంగా చూడగల్గుతున్నారు. 'బీప్-బీప్' అంటూ అది చేసే సంకేతధ్వనులను రేడియోద్వారా విని, విస్మయం చెందుతున్నారు. అన్ని దేశాలలోనూ ఫొటోలు తీస్తున్నారు.

అక్టోబరు 13-వ తేదినాటికి సోవియట్ 'బాలచంద్రుడు' భూమిచుట్టూ 130 సార్లు ప్రదక్షిణం పూర్తిచేసినట్టూ, అప్పుడే 35,60,000 మైళ్ళకు పైగా ప్రయాణం చేసినట్టూ శాస్త్రజ్ఞులు అంచనా వేసి చెబుతున్నారు. కృత్రిమగ్రహాన్ని అంతరిక్షంలోకి విసరివేసిన రాకెట్ భాగం గమనవేగం హెచ్చవుతున్నదనీ, అది ఉపగ్రహాన్ని అతిక్రమించికూడా ముందుకు పోయి తిరుగుతున్నదనీ 'టాస్' వార్తాసంస్థ తెల్పుతున్నది.

*　　*　　*　　*

ఆంధ్రప్రదేశ్ అంతటా నవంబరు 2 వ తేదీనుంచి 8 వ తేదీవరకూ, అఖిలభారత చేతి పరిశ్రమల వారోత్సవాలు జరుపబడతాయి. ఈ సందర్భంలో ఉత్తమ చేతివస్తువుల ఉత్పత్తిదారులకు బహుమతులు యివ్వబడతాయి.

*　　*　　*　　*

శ్రీ ఆచార్య వినోబాభావే ప్రారంభించిన భూదానోద్యమానికి 1951 ఏప్రిల్‌నుంచి యింతవరకు 42 లక్షల ఎకరాల భూమి విరాళంగా లభించింది. గ్రామదానోద్యమానికి, యింతవరకూ 3,220 గ్రామాలు విరాళంగా సేకరించబడినాయి.

*　　*　　*　　*

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, కేంద్రప్రభుత్వపు సహాయంతో హైదరాబాదులో భిక్షుకగృహాన్ని ఏర్పాటుచేయాలని ప్రయత్నిస్తున్నది. ఇలాగే విజయవాడ, తిరుపతిలోకూడా, భిక్షుకగృహాలు ప్రారంభించాలనే ఆలోచనవున్నది.



# చిత్ర కథ





దాసూ, వాసూలు టపాకాయలు కాలుస్తూ, బజారుకు బయలుదేరారు. 'టైగర్' టపాకాయ మోగినప్పుడల్లా, ఎగిరి గంతులేస్తున్నది. దారిలో ఒకచోట వాళ్లకు సీమ టపాకాయలకట్ట కనిపించింది. వాళ్లు దానిని సమీపించేలోపల, ఒక పెద్ద కుక్క, అదేదో తినేవస్తువనుకుని మొరుగుతూ వచ్చింది. దాసు చేతులో వున్న నిప్పుతాడు కింద పడటం, 'టైగర్' చూసింది. వెంటనే అది ఆ తాడును నోటితో కరుచుకువెళ్లి టపాకాయలమీద వేసింది. టపాకాయలు ఫెళ్లుమని ఒక్క సారి పేలిపోయాయి. అప్పుడు పొగరుబోతు కుక్క తీసిన పరుగు చూడవలసిందే!






Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'

BY 100

# బిన్నీవారి కాట్స్‌వాల్



మీ శరీరాన్ని వాతావరణంనుంచి కాపాడె అత్యద్భుత వస్త్రాలు

"చిట్టీ! ఇప్పుడెంత బాగా వున్నావే! ఇప్పుడు
అందమైన మెత్తని కాట్స్‌వాల్
తొడుకున్నావు—అబ్బ ఎంత
బావున్నావ్!"



కాట్స్‌వాల్ సాటిలేని విలువకలది; కారణం...అతి జాగ్రత్తగా, శాస్త్రీయమైన పద్ధతులలో శ్రేష్ఠమైన వున్ని, నూలు కలిపి అది తయారు చేయబడింది.

ఎంత బేఫర్వాగా వాడినా తుదివరకు మెత్తగా, మృదువుగా వుంటుంది. ప్రత్యేకించి పాపలకు, పిల్లలకు తగినది. వారి మృదువైన చర్మానికి ఎంతమాత్రం హాని చేకూర్చదు. ఎప్పుడూ కళ్ల జిగేల్మనేటట్టు అందంగాను ప్రతి సీజన్‌కు తగినట్టుగాను వుంటుంది.

అనేక రంగులు, అనేక డిజైనులు వున్నందున మీ యిష్టంవచ్చినదానిని, మీకు నచ్చినదానిని ఎన్నుకోవచ్చును. కాట్స్‌వాల్ కుంగదని హామీ యిస్తున్నాము. ఇంటిలోనే కాట్స్‌వాల్ వస్త్రాలు ఉతుక్కోవచ్చు.

అనేక రంగులలో, ప్రింట్‌లలో, గళ్లలో, పైజమాగీరలలో దొరుకుతుంది.

కాట్స్‌వాల్‌కు ప్రత్యామ్నాయమైంది లేదు! అధిక వెచ్చదనానికి-బిన్నీవారి అంగోలా ధరించండి!

ఉన్ని, నూలు కలిపిన మేలిరకం, దట్టంగా వుంటుంది, చలికాలానికి బహు మంచిది. అనేక రంగులనుంచి ఎన్నుకోండి!




**ఉచితం**

బిన్నీవారి కాట్స్‌వాల్ దుస్తుల నమూనాలుసచిత్రమైన పుస్తకం ఉచితంగా లభిస్తుంది. 13 నయా పైసల పోస్టు బిళ్లలు డిపార్టుమెంట్ XXXX పోస్టుబ్యాగ్ 2701, మద్రాసు-6 కు పంపండి

## ది బెంగుళూర్ వులెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ, లిమిటెడ్.

మేనేజింగ్ ఏజెంట్లు: బిన్నీ & కం. (మద్రాసు) లిమిటెడ్.

# ఆంధ్ర జనావళికి దీపావళి శుభాభినందనలు!

ఎ. వి. యం. వారి

"భూకైలాస్"

గొప్ప పౌరాణిక చిత్రం

డైరెక్షన్ : శంకర్

విజయవారి

"అప్పుచేసి పప్పుకూడు"

యన్. టి. రామారావు, సావిత్రి,
జమున, రేలంగి

డైరెక్షన్ : ప్రసాద్

ఆర్. ఆర్. పిక్చర్స్‌వారి

"కార్తవరాయన్ కథ"

యన్. టి. రామారావు, సావిత్రి, కన్నాంబ,
గిరిజ, రమణారెడ్డి వగైరా

డైరెక్షన్ : రామన్న

అరుణ ఫిలిమ్స్‌వారి

"బొమ్మల పెళ్ళి"

జమున, శివాజి గణేశన్,
యస్. వి. రంగారావు, ఋష్యేంద్రమణి,
నాగయ్యగార్లు వగైరా.

విడుదలకు సిద్ధముగా నున్న :

రాజకమల్ వారి

"దో ఆంఖేన్ బరా హాత్"

సంధ్య, శాంతారామ్, నటించినది

డైరెక్షన్ : శాంతారామ్

రానున్న చిత్రాలు :

రామన్ ప్రొడక్షన్స్‌వారి

జ్వాలా (టెక్నికలర్)

కిషోర్‌కుమార్, మధుబాల, విజయలక్ష్మి,
షొరాబ్ మోడి, ప్రాణ్ వగైరాలు

డైరెక్షన్ : యం. వి. రామన్

రమణ్ బి. దేశాయివారి

నాగమణి

డైరెక్షన్ : రమణ్ బి. దేశాయ్

ఆనందానికి ఆదాయానికి

విజయ పిక్చర్స్,

గాంధినగర్ విజయవాడ-2



# సుభిక్షమైన పంట!

మా 'కమలము మార్కు మిశ్రపు ఎరువులు' ఉపయోగించి మీరున్నూ అటువంటి పంటలు పండించపచ్చును.

ఇవి అన్ని ఋతువులలో అన్ని పంటలకు లభించును—తోటలకు అవసరమైన ఎరువులను, కోరిన విధముగా సప్లయి చేయగలము—ఉచితముగ నిచ్చెడి మా సలహాను పొందవచ్చు. ఇందుకు ఏమీ ఇవ్వనక్కరలేదు—మీ భూమిని సారవంతముగ చేయండి. సుభిక్షమైన పంటను రూఢిచేసుకోండి.

సూపర్ - ఫాస్ఫేట్లు ఎల్లప్పుడూ దొరకును

మీ ఎరువుల విషయమై, సంశయించక మమ్మల్ని సలహాచేయండి:

★

## ది మైసూర్ ఫర్టిలైజర్ కంపెనీ.,

31-ఎ, నార్త్‌బీచ్ రోడ్డు :: మదరాసు - 1

---

# మొట్టమొదటిసారిగా

డి డి టి, బి హెచ్ సి, లిన్డేన్, టాక్సాఫెన్, ఆల్డ్రిన్, డయల్డ్రిన్, క్లోర్డేన్ ఎన్డ్రిన్ మొదలైనవి ఆధారముగా వృక్ష క్రిమిసంహారకములున్ను,

రాగి, గంధకము మొదలైనవాటిని అనుసరించి, పంటలను నాశనంచేసే పురుగులను తొలగించు సాధనములున్ను

దక్షిణ ఇండియాలోని మద్రాసు, కుప్పం (ఆంధ్రరాష్ట్రం) ఫ్యాక్టరీలలో తయారుచేయుచున్నాము.

★

పూర్తి వివరములకు:

## ది మైసూర్ ఇన్‌సెక్టిసైడ్స్ కంపెనీ.,

31-ఎ, నార్త్‌బీచ్ రోడ్డు :: మదరాసు - 1

# హంగ్లీ ప్రింటింగ్ సిరాలు

నలభై ఏళ్లకు పైగా భారతీయ
ముద్రాపకులకు సేవ చేస్తున్నవి.

భారతదేశ పరిస్థితులకు అనుకూలయోగ్యముగ
భారత దేశంలోనే తయారవుతున్నవి

★

## హంగ్లీ ఇంక్ కంపెనీ, ప్రైవేట్ లిమిటెడ్,

కలకత్తా - బొంబాయి - మద్రాసు - ఢిల్లీ

Worth any price

"And yet priced low"

Nutrine
SWEETS

ది న్యూట్రీన్ కన్‌ఫెక్షనరి కంపెని
లిమిటెడ్, చిత్తూరు (ఆంధ్ర)



దీపావళి అభివందనములతో!



విజయవంతముగా అన్ని కేంద్రములలోను
ప్రదర్శింపబడుచున్న

అనుపమ వారి,
ఎమ్. ఎల్. ఏ

మహా రాబోవు చిత్రాలు

అనుపమ వారి,
మాల పిలి..
కాటమరాజు కధ..
పుట్టినరోజు..

ప్రకాష్ స్టూడియోస్
రాజద్రోహి

విశ్వరూపా వారి
ప్రొడక్షన్ నెం. 1

నందీ ప్రొడక్షన్స్
శ్రీ కృష్ణ గారడి
మోహినీరుక్మాంగద

డిస్ట్రిబ్యూటర్స్
ప్రభాత్ పిక్చర్సు (ప్రై) లిమిటెడ్..... గాంధీనగరం:- విజయవాడ.. 2.


చూడండి! సన్‌లైట్
సగంబిళ్ల మాత్రమే
ఈ బట్టలన్నిటిని
ఉతికింది!
అట్లు చేయునట్టిది ఆ
అధికమైన నురగ!
SUNLIGHT SOAP
సన్‌లైట్
సబ్బు
బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును!
S. 249-50 TL

# స్వదేశి

## అత్యుత్తమమైన చక్కటి టైపులకు పెట్టినది పేరు

★ 14 భాషలలోనూ టైపులు పోసి సకాలంలో ఇవ్వగలము

★

★ హాఫ్‌టోన్, లైన్, ఎలెక్ట్రోబ్లాకులు తయారుచేసి ఇవ్వగలము

★

★ అచ్చుపనులకు అవసరమైన అన్నిరకముల మిషనులు, పరికరములు సప్లయిచేయుదుము

★

"యువ" హైదరాబాద్‌వారి ప్రెస్ టైపులు, పరికరాలు మేమే సప్లయిచేశాము !

---

## స్వదేశీ టైప్ ఫౌండ్రీ

పో. బా. 2433 చింతాద్రిపేట మదరాసు—2.

ఫోన్ : 84469

కేబిల్ : "BHUVANA"

Grams: CLEARANCE



# All India Clearing & Trading Co.

*CUSTOMS CLEARING AGENTS*

**310-11, LINGHI CHETTY ST., MADRAS-1**

WE 'LL HELP YOU SOLVE ALL
**your *IMPORT-EXPORT* problems**

*WE CAN HANDLE ALL YOUR GOODS*

FOR

## EXPORTS and IMPORTS at MADRAS,

no matter whether they are small or big.

*In addition to these, we have three specialized departments to deal with*

- ★ **Clearance of Post and Air Parcels arriving from Foreign Countries.**
- ★ **Transhipment of goods to Pondicherry by sea or to any other station, by rail or road.**
- ★ **Problems Connected with Import Licences, Customs Duty, Harbour dues etc., and long outstanding cases pertaining to them.**

*Our Specialists in charge of these Departments will give you Expert Advice and Solve all your Problems in the Quickest Possible Time.*

**SERVICE IS OUR MOTTO**

# ఏ రకపు

# ఆభరణాలైనా

గాజులుగాని కంఠహారములు కాని కంకణములుగాని, చెవిపోగులేగాని ముక్కుకాడలేకానీ—బంగారు ఆభరణాలు ఏవైనా సరే (సాదావి, నగిషీ చెక్కినవి, రత్నాలు పొదిగినవి), ఇవిగాక—వెండితో చేసిన డిన్నర్, టీ, కాఫీ లేక లెమన్‌సెట్లు—అనేక రకాలు, నమూనాలు సిద్ధంగా వున్నవి..............

కావాలంటే, మీ కొలతలప్రకారం సరీగా తయారుచేసి యివ్వబడును.

అసమానమైన పనితనము.

★



*Vummidi*

**RAMIAH CHETTY, GURUSWAMY CHETTY & CO.,** *Jewellers*

23-25, CHINA BAZAAR ROAD, MADRAS—1.

## ఉమ్మిడి రామయ్యశెట్టి, గురుస్వామిశెట్టి అండ్ కో.,

నగలవర్తకులు : 23 - 25, చైనాబజార్ రోడ్డు, మద్రాసు - 1.

# దీపావళి కానుకలు

## చిట్టి చిట్టి బాలలకు
## అందమైన పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| మామకథలు | (కథలు) | నార్ల చిరంజీవి | 0-75 |
| నీతికథానిధి | ,, | ,, | 0-50 |
| గులాబీబాల | ,, | అమరసుందర్ | 0-62 |
| ఛప్రాసీ | ,, | పురాణం | 0-50 |
| పుట్టిన రోజు | ,, | పాపాయి | 0-62 |
| వనభోజనం | ,, | మధురాంతకం రాజారాం | 1-50 |
| బాలకథామాల | ,, | పి. లక్ష్మీకాంతమోహన్ | 1-37 |
| కొంటె కిష్టు | ,, | వివిధ రచయితలు | 0-62 |
| చిలక చదువు | ,, | ,, | 0-62 |
| కొయ్యగుర్రం | (నాటికలు) | రోహిణి | 0-75 |
| నాగులు | ,, | వివిధ రచయితలు | 0-75 |
| అందాలపాప | (పాటలు) | మధురాంతకం రాజారాం | 0-62 |
| పాపల్లారా | ,, | సమతారావు | 0-62 |
| బుజ్జి బాబు | ,, | అడ్సుమిల్లి | 0-62 |
| గుజ్జనగూళ్లు | ,, | కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు | 1-00 |

(పోష్టేజి అదనం)

విశాలాంధ్ర
ప్రచురణాలయం,
విజయవాడ-2

**BUYING DRESSES!**

**INSIST ON THIS TRADE MARK!!**




**FOR FASHION, COMFORT & DURABILITY**

**Wanted Stockists in Unrepresented Areas**

PHONE: 2763 GRAMS: 'PIDIEMCO' Bangalore

MANUFACTURERS

## THE PRAKASH DRESS MFG. CO.,

KEMPEGOWDA ROAD CROSS 1, POST BOX No. 657

**BANGALORE-9**

తంతి : "పెయింట్స్‌వేర్"
తపాలుపెట్టె సం. 546

## కె. కె. సబాపతి & కో.,

పెయింట్ల వర్తకులు, ఆర్టిస్టు బ్రష్‌లు - ఆర్టిస్టుల
పరికరాలు, డ్రైకలర్సు దిగుమతిదారులు

**318, రాసప్పశెట్టి వీధి, మద్రాసు - 3**

అన్ని రకముల నాణ్యమైన పెయింట్లు, ఎనామిల్సు,
వార్నిషులు, బ్రష్‌లు, డ్రై కలర్సు, అవిశ నూనె,
డిస్టెంపర్లు, ఫినైలు వగైరాలకు స్టాకిస్టులు.
అపోక్లైట్ సింతెటిక్ ఎనామిల్స్‌కి ప్రధాన స్టాకిస్టులు.

డీలర్లకు, పి. డబ్ల్యు. డి. కంట్రాక్టర్లకు, స్టూడియోలకు, బస్,
లారీల బాడీ నిర్మాతలకు, మొదలగువారికి సప్లయిదారులు.

ఆర్డర్లు దయచేయించ కోరుతున్నాము

పూజనీయులైన మా అభిమానులు అందరికీ
హృదయపూర్వకమైన
దీపావళీ అభివందనములు

# ఘోమ్రా బ్రదర్స్

'ఘోమ్రా హవుస్'

392, మింట్ స్ట్రీట్, మదరాసు-1

ఫోన్ నెం. 3845-3078 :: తంతి: "PHUMBHRA"





సమస్తమైన
ఎలక్ట్రిక్ పరికరములు

గృహోపయోగములకు
పారిశ్రామికములకు వ॥



సప్లయిదారులు, సుప్రసిద్ధ స్టాకిస్టులు
(రేటు కొరకు నేడే వ్రాయండి)

ముద్రణయంత్రాలపై విధింపబడిన
దిగుమతుల నిషేధంవల్ల మేము చేసే
సప్లయిలు తగ్గించక తప్పిందికాదు!

★

అందుచేత ఈ తాత్కాలికపు ఆటంకాన్ని
గమనించవలసిందిగా మా వ్యాపార
మిత్రులందరినీ కోరుతున్నాము

★

అయితే, తదితర దేశీయ వస్తువులు:
అనగా ముద్రాపకుల వివిధ పరికరాలను
పూర్తిగా సప్లయి చేయగల్గుతున్నాము

"ముద్రణశాఖలో మా సహకారము
మీకు ఎల్లప్పుడూ కలదని నమ్మండి"

## ది స్టాండర్డ్ ప్రింటింగ్ మెషీనరీ కంపెనీ,

12/81 శంబుదాస్ స్ట్రీట్ :: మద్రాసు-1.

తంతి: టెలిఫోన్:

"PRINTMACHO" 55096



ఫోటో : 33 గెవాపాన్‌పై
ప్రాణ్‌లాల్ కె. పటేల్, ఎ. ఆర్. పి. ఎస్. తీసినది.




# రేపటి పౌరులు

ఆ పిల్ల నవ్వే పెంకెనవ్వా-మెరిసే కెమెరామీటలను తన చిన్ని వేళ్లతో పట్టవలెనని ఆరాటపడే ఆమె తమ్ముడి చురుకు చూపు.... ఇది భారతదేశపు పిల్లల బొమ్మకథ. మీ స్వంత జెస్ ఐకన్ కెమెరాతో తీసే బొమ్మలు ఇంకా ఎంత ఆనందమిస్తవో! అవి మీ అద్భుత మధురస్మృతుల్ని తలపుకి తెస్తవి. జెస్ ఐకన్ కెమెరా ప్రపంచంలో కెల్ల సుందరమైంది. పైగా వర్ణచిత్రాలకూ, నలుపు తెలుపు చిత్రాలకూ గెవార్ట్ ఫిలిమ్‌ను మించినదిలేదు. జెస్ ఐకన్, గెవార్టు కలసి ఫొటోగ్రఫీలో ప్రామాణ్యాన్ని నిలబెట్టుతున్నవి.

**GEVAERT**

**ALLIED PHOTOGRAPHICS PRIVATE LIMITED**

ఏ కెమెరాతో తీసినా, నలుపు-తెలుపు లేక వర్ణచిత్రాల మంచి ఫలితాలకు ఎల్లప్పుడు గెవాపాన్ లేక గెవాకలర్ ఫిలిమ్సున్ను, గెవార్ట్ ఫొటొగ్రాఫిక్ పేపర్లున్ను వాడండి.




కాన్టాఫ్లెక్స్

ఒకే లెన్సు, మిర్రర్ రిఫ్లెక్సు, పెద్ద ఎక్స్ట్రాబ్రైట్ వ్యూఫైన్డర్ గల చిన్ని కెమెరా. జెస్ టెస్సార్ ఎఫ్ 2.8 కన్వర్టిబిల్ లెన్స్: ఫ్రంట్ ఎలిమెంట్, బేయునెట్ మౌంటెడ్‌కు బదులు టెలిఫొటో, వైడ్‌యాంగిల్ లేక స్టీరియోయూనిట్‌లు కలర్ షాట్స్‌కు జెస్ లెన్స్‌ల పనితనం ఆశ్చర్యకరం. సింక్రో-కాంపర్ షటర్ సెల్ఫ్-టైమర్ లైట్ వాల్యూ స్కేల్ సహా: బిల్ట్-ఇన్ ఎక్స్‌పోజర్ మీటర్. కాన్టినా, ఇతర జెస్ ఐకన్ కెమెరాల కోసం మీ డీలర్‌ను అడగండి.







ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ ప్రైవేట్ లిమిటెడ్, కస్తూరి బిల్డింగ్, జంషెడ్జీ టాటా రోడ్డు, బొంబాయి-1

విజయా వారి

రాబోవు హాస్యరస చిత్రము..

# అప్పు చేసి పప్పు కూడు

యన్.టి.రామారావు...సావిత్రి...జమున

యస్.వి.రంగారావు...రేలంగి

డైరెక్షన్... ప్రసాద్



నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి...

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

కుండల దొంతి కాని.

పంపినవారు :
ఎం. జి. కాంతమ్మ - ఆదోని

